

ముఖచిత్ర కారుడు
ఫ్రాంజ్ మార్క్ (1880 - 1916)

మార్క్ బిడియస్తుడు, సున్నిత మనస్కుడు. జర్మన్ అభివ్యక్త సంప్రదాయానికి (expressionist Tradition) చెందిన చిత్ర లేఖకుడు. పాపం పూజారి అవుదామనే ఉద్దేశంతో ఆసిక్య విద్య (theology) ను అభ్యసించాడు. తన 20వ యేట కళపై దృష్టి సారించి, తన దైన ప్రత్యేక శైలిని రూపకల్పన చేయడానికి ఎంతో శ్రమించ వలసివచ్చింది. ఒకసారి అతడు పారిస్ వెళ్ళాడు. అక్కడ వాన్‌గాగ్, గాగుయిన్‌ల చిత్రాలను చూడడం జరిగింది. వారిని ఉదాహరణగా తీసుకొని వర్ణ తీవ్రతను పెంచి, సరళాకృతులతో జంతువుల చిత్రాలను చిత్రించాడు.

1911లో మార్క్ New Artists' Association లో చేరాడు. కాని అనతి కాలంలో దానినుంచి కండిన్‌స్కీతో పాటు విడిపోయి blaue Reiter సంఘాన్ని సంస్థాపించాడు. ఈ సంస్థ రెండు ప్రదర్శనలను ఏర్పాటు చేయడమేకాక కళా సంశ్లేషణతో గూడిన ఒక ప్రచురణ గూడ వెలువరించింది. కాని ప్రథమ ప్రపంచ సంగ్రామం అతనిని తన వృత్తిలో కొనసాగనీయలేదు. యుద్ధంలో పాల్గొన్నాడు. 1916లో వెర్డన్‌సమీపంలో హతుడయ్యాడు. మానవస్థితితో అసంతృప్తుడై, కళను జంతువీకరణం చేశాడు.

## ముఖచిత్రం గురించి

పిల్లితో నగ్నికను 1910లో చిత్రించాడు. మాటిసే తొలికృతులు చూసిన తరవాత ప్రాథమిక, తీవ్ర వర్ణాలను వాడడం మొదలుపెట్టాడు అలా తీవ్ర ప్రాథమిక వర్ణాలను వాడినదే ఈ చిత్రం.

# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.**

సంపుటి 8 డిసెంబర్ 1996 సంచిక 11

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక



**ముఖచిత్రం : NUDE WITH CAT (1910)**

విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

Printed, Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd., 1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7612436, 7612337.

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

**(Launching the ""Shankar's Weekly" on May 23, 1948. Prime Minister Nehru told Shankar ""not to spare him". Between May 1948 and May 1964, Panditji "appeared' in nearly 1,500 cartoons and was chosen "The Man of the Week' on more than a hundred occasions.)**



JAWAHARLAL Nehru must have been naughty as a boy - obstinate, perplexed, chivalrous and cheerful. He has not changed. If he were not a political leader or Prime Minister, he would have discovered India more, written more books and gathered good royalties. If he were not writing books, he would have kept himself busy swiping flies and catching butterflies. At 17, York Road, there is no lack of either flies or butterflies. They come in endless succession, from morning till late in the night. The more he swipes the flies, the more they come to trouble him. The smile changes into a frown, the chin stands out more dauntlessly! He looks perplexed and thoughtful. But he asks the world to hit him hard because he is still the naughty boy who can take it. And it is safe to hit him hard because he never hits back.

Jawaharlal is not true to type. His smiles and frowns are not typical. Politiciansthink he is too honest to be one of them.

On the verge of sixty he is the boy of Harrow, dreaming of great things for his country.Itdoes not matter to him that his dreams may be unreal. He keeps his freshness of heart - the dauntless boy, intent on his butterflies, willing to be cheated but incapable ofcheating.

***(May 30, 1948)***

# ''పురాణ'' మిత్యేవ సాధుసర్వం

- హితశ్రీ

నవంబర్ 18వ తేదీ దూరదర్శన్ తెలుగువార్తలు.

''పురాణం'' మరి లేరనే పిడుగు పాటు లాంటి వార్త. దిగ్భ్రాంతి చెందాను. మనసునిండా తీవ్ర విషాదం ఎన్నో జ్ఞాపకాలు ఎన్నో దృశ్యాలు

1951-53 సంవత్సరాల్లో వాల్తేరులో చదువుతున్నప్పుడు నాకు శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాధరావు పరిచయమయ్యారు. ఆయన బి ఏ -ఆనర్స్ చదువుతున్నారు తెలుగు స్వతంత్ర వార పత్రికలో మేము కథలు రాస్తుండే వాళ్ళం. మేమిద్దరం విశాఖపట్నం హిందూ రీడింగ్ రూంలో శ్రీపురాణంని కలుసుకున్నాం మొదటిసారిగా. అప్పుడాయన రైల్వేలో ఏదో ఉద్యోగం చేస్తున్నారు. పత్రికల్లో విరివిగా రాస్తూండేవారు బక్కపలచటి మనిషి. ఆయనలో ఎంత రచనా విస్ఫోటన శక్తి ఉందో తలచుకొంటే ఆశ్చర్యం వేస్తుంది

1954లో అనుకొంటాను, న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్ పత్రిక నిర్వహించిన ప్రపంచ కథల పోటీలో తెలుగు స్థాయిలో ''పురాణం'' కథ ''నీలి''కి ప్రథమ బహుమతి వచ్చింది చాలా సంతోషించాను. అదొక అద్భుత కథ, మానసిక ప్రచండ మారుతానికి జాజ్వల్యమానమైన నిదర్శనం. ఈ పోటీలో నాకథ 'స్త్రీ' కి కూడా ఒక బహుమతి వచ్చింది. దానికి నన్ను ఆయనను మనసారా అభినందించటమే కాక, మేము ఇతర సాహితీ మిత్రుల్ని కలుసుకొన్నప్పుడు ఈ విషయంలో వాళ్ళకి చెబుతూ ఉండేవారు.

సుమారు పాతిక ముప్ఫయి సంవత్సరాలకిందట ఆయన బెంగాల్‌లో చేస్తున్న రైల్వే ఉద్యోగాన్ని వదిలేసి, ఆంధ్రజ్యోతి సచిత్ర వార పత్రిక సంపాదకత్వం నిర్వహించటానికి విజయవాడ వచ్చారు. రావటమే తడవుగా కథ పంపమని రాశారు ఏదో పంపాను. ప్రముఖంగా వేశారు అప్పటి నించీ కొంచెం తరుచుగా ''పురాణం'' వారిని కలుసుకోటం జరిగేది కలుసుకున్నప్పుడల్లా ఏదో రాయమని ప్రోత్సహిస్తూ ఉండేవారు పురాణం దంపతులు మొదటిసారి తెనాలి మా ఇంటికి వచ్చినప్పుడు మా శ్రీమతి ''మీ ఇల్లాలి ముచ్చట్లు ఎప్పుడూ చదువుతూ ఉంటామనీ - చాలా బాగుంటాయి'' అంటే పురాణం పొంగిపోయి చిరునవ్వు నవ్వారు ఆ చిరు దరహాసం ఇప్పటికీ నాకు గుర్తు ''రచనా ప్రశంస అందుకోటం కంటె రచయిత కేం కావాలి'' అనేది ఆ చిరునవ్వు భాష '' ఇల్లాలి ముచ్చట్లు'' పురాణం సీత అనే పేరుతో పురాణం రాసేవారు. అది జగత్ప్రసిద్ధం ఆ పుస్తకాన్ని నాగపూర్ విశ్వవిద్యాలయం పాఠ్యగ్రంథంగా పెట్టారని పురాణం అన్నారు, కొంచెం ఆశ్చర్యం ప్రకటిస్తూ. ఆశ్చర్యమేముంది? అవన్నీ పురాణం నిర్భయతకీ, నిశిత వ్యంగ్య విన్యాసాలకీ హాస్య ధోరణికీ మచ్చుతునకలు ఎవర్ని విమర్శించటానికీ ఆయన జంకలేదు

మొదట్లో పురాణం తెనాలి వచ్చినప్పుడు మిత్రులు, సహాధ్యాపకులు శ్రీ తాళ్ళూరు నాగేశ్వరరావు, శ్రీ సౌజన్య, అప్పట్లో తెనాలిలో పనిచేస్తున్న బీనాదేవి గారు ( జడ్జిగారు అని వారిని

పిలుస్తుండే వాళ్ళం) నేనూ కలిసి సరదాగా గడిపేవాళ్ళం. తరవాత డ్యాక్టర్ కొత్త రవీంద్రబాబుగారు రచించిన కథల పుస్తకం ఆవిష్కరించటానికి పురాణం వారిని ఆహ్వానించటానికి నేనూ డ్యాక్టరుగారూ విజయవాడ ఆంధ్రజ్యోతి ఆఫీసుకి వెళ్ళి కలుసుకొన్నాం. పురాణం పుస్తకాన్ని ఆవిష్కరించారు. పురాణంకి శరీర స్వస్థత సరిగా ఉండేది కాదు. అప్పుడప్పుడు తెనాలి రవీంద్ర బాబుగారి దగ్గరికి ట్రీట్‌మెంట్ కోసం వస్తూ ఉండేవారు అలా కలుసుకొనేవాళ్ళం

ఓ సంవత్సరం ఆంధ్రజ్యోతి కథల పోటికి వచ్చిన కథలు పరిశీలించటానికి తెనాలి వచ్చి ట్రావెలర్స్ బంగాళాలో మూడురోజులు మకాం వేశారు. నన్నూ డ్యాక్టర్ గారినీ జడ్జిలుగా వేశారు. ఆ మూడురోజులూ రచనల గురించి అనేక విషయాలు చెప్పారు. డ్యాక్టర్ జి.వి. కృష్ణారావుగారి ప్రసక్తిరాగా, రస నిష్పత్తిని గురించి మాట్లాడారు. పురాణంకు ఇంత తెలుసా అని ఆశ్చర్యపోయాను.

పురాణం వారి అమ్మాయి వివాహానికి విజయవాడలో పెళ్ళి పందిరిలో సాహితీ మిత్రులంతా కలిసి పలకరించుకోటం ఓ మరుపురాని సన్నివేశం

1986లో నాకు తెనాలిలో ఓ సాహితీ సత్కారం జరిగింది సాహితీ సహృదయ మిత్రులు

**కట్టమంచి, కవిరాజు, నార్ల, విశ్వనాథ, వీరేశలింగం, గురజాడ, జాషువా లాంటి ఎందరో మహామహుల అంతరంగాల నవలోడనం చేసి, మెరుపుల్నీ , మరకల్నీ, వెలువరించి, మిసిమి పుటలను మిలమిలలతో పులకితం చేసిన విలక్షణ మధురవాణిని చెక్కిన పురాణం ఉలి చలనం శాశ్వతంగా ఆగిపోయింది. పంచామృతాల నందించిన కలం ఇంకిపోయింది. పురాణం మరిలేరు. ఆయన అంతిమయాత్రకు చెమరిన కన్నులతో శ్రద్ధాంజలి ఘటిస్తున్నది మిసిమి.**

- మిసిమి

శ్రీ నండూరి రామమోహన్‌రావు గారు, డ్యాక్టర్ కొమ్మూరి వేణుగోపాలరావు గారు, శ్రీ పురాణం సభలో ప్రసంగించారు. అది నాకోమధుర స్మృతి. ఆంధ్రజ్యోతి దిన పత్రికలో ముత్యాలపందిరి శీర్షిక కింద ఏవైనా వ్యంగ్య రచనలు రాయమని ప్రోద్భల పరిచారు, సంకోచించాను పురాణం బలవంతం చేశారు. అలా ఆ రచనలు చేయటం జరిగింది

పురాణంలో అద్భుత సంపాదక ప్రతిభ ఉంది రచనలు మానేసిన నాలాంటి వాళ్ళచేత రాయించారు కొత్త రచయితల్ని వెలికితీసి ప్రోత్సహించటంలో పురాణం అందెవేసిన చేయి. ఎందరో కొత్త రచయితల్ని పరిచయం చేశారు ఆయినలో ఆవేశం ఉంది. ఆలోచన ఉంది. క్లాసు, మాసు - రెండూ చూడాలంటారు పురాణం. ఈ మార్కెట్ విలువల కాలంలో అసిధారావ్రతంతో పత్రిక దిగ్విజయంగా నిర్వహించిన ఘనత ''పురాణం'' వారిదే

పురాణం ఎన్నో రసభరితమైన రచనలు చేశారు. రేడియో నాటికలు రాశారు ''సైకిల్ అప్పారావు'' రేడియో నాటిక అత్యంత ప్రసిద్ధమైంది. అందులో హాస్యం, విషాదం రెండూ

మిళితమై పురాణం రచనా ధోరణికి అర్థం పడుతున్నది. ఏనాడో భారతిలో రాసిన ''అర్థం గాని మార్పు'' వంటి ఆహ్లాద రచన నించి ఆమధ్య రాసిన ప్రసిద్ధమైన బరువు రచన ''సీతజడ'' దాకా పురాణం కలం ఎన్నో పరవళ్ళుతొక్కింది. ఇక మిసిమిలో పురాణం ప్రచురించిన ప్రఖ్యాత వ్యక్తుల ఇంటర్వ్యూలు పురాణం హాస్య, గంభీర, వ్యంగ్య రచనా శైలికి విఖ్యాత దృష్టాంతాలు.

తిరుపతిలో వైభవంగా అమ్మాయి వివాహం జరుగుతున్న సమయంలో కుమారుణ్ణి కోల్పోయి దురదృష్టవంతులయారు పురాణం. మరో దెబ్బ ఈ మధ్యనే మరో కుమారుడి ఆకస్మిక మృతి వారిని కుంగతీసింది. ఆరోగ్యం కూడా అంతంత మాత్రం. తిరుపతి దుర్ఘటన తర్వాత ఓ ఉత్తరం రాశారు అదే ఆఖరి ఉత్తరం

నా ''హితశ్రీ కథామంజూషిక'' చదివి '' మీ కథలు ప్రత్యేక తరహాకి చెందినవి, వాటిమీద ఓ వ్యాసం రాస్తాను'' అన్న పురాణం మాట నిలబెట్టుకోకుండానే దూరతీరాలకి వెళ్ళిపోయారు

ఏంరాసినా, ఏంచేసినా పురాణం పురాణమే

''పురాణ మిత్యేవ నసాధుసర్వం'' అన్నాడు కాళిదాసు.

''పురాణ'' మిత్యేవ సాధుసర్వం అని ఆప్యాయంగా పురాణం వారిని గురించి అనుకొంటూ ఉంటాను.

# High Brows & Low

*- By Prasenjit Chowdhury*

**Is snobbery bad? Thackeray was a snob, as were Forster, Maynard Keyes, Shaw and Swift. Nirad Chaudhuri is the most erudite, by his own admission. In fact, everyone is a snob**

William Makepeace Thackeray called George IV a snob The King, Thackeray fumed, had assumed he was the "the greatest gentleman in Europe" without so much as having the credentials of one Which raises the question - Who is a snob? Someone who arrogates to himself merits he does not deserve? Should someone who has begun "attitudinizing" on the way to becoming one?

A scholar who is too conscious of his intellectual superiority often gets carried away by conceit and self-indulgence and joins the clan of elites. And an elite, as Dole recently defined, is one "Who never grew up, never sacrified, never suffered and never learnt"

Every person is a snob. Take G.B. Shaw, the way he poked fun at war, grilled portmanteau music-critics or anagrammed (sort of) Tagore's name. Swift's Yahoomanity (Gulliver's Travels), was a snobbish indictment. Baffled in his poetic ambitions, poe fooled readers with hoaxes, shocked their middle-class sensibilities with stories of putrefaction and death, savagely attacked writers who had talent, praised those who had none and took refuge in the arcane, ignoring popular issues

***The Statesman***

# మహామహోపాధ్యాయ కొత్త సచ్చిదానంద మూర్తి దృష్టిలో వేమన

- టి. రవిచంద్

1995లో సాహిత్య అకాడమి ప్రచురణగా వెలువడిన ''సెలెక్టెడ్ వర్సెస్ ఆఫ్‌వేమన'' (వేమన ఏరిన పద్యాలు) గ్రంథాన్ని అనువాదకులు జె. ఎస్.ఆర్. ఎల్. నారాయణ మూర్తి ఇలియట్‌రాబర్ట్స్ ప్రొఫెసర్‌సచ్చిదానందమూర్తికి అంకితమిచ్చారు. అనువాదకులు ఏ ఉద్దేశ్యంతో ప్రొఫెసర్ సచ్చిదానంద మూర్తికి తమ ఆంగ్లానువాదాన్ని అంకితమిచ్చినా అది నిజంగా సముచిత నిర్ణయం. వేమనకు భారతీయ దార్శనిక చింతనాచరిత్రలో మొట్టమొదటిసారి స్థానం కల్పించిన భారతీయ తత్వశాస్త్ర చరిత్రకారులలో ప్రొఫెసర్ సచ్చిదానందమూర్తిని ప్రథముడిగా పరిగణించవచ్చు. యునెస్కో (అంతర్జాతీయ విద్యాసాంస్కృతిక సంస్థ) వారి అభ్యర్థన మేరకు ''ఫిలాసఫి ఇన్ ఇండియా'' (భారతదేశంలో తత్వశాస్త్రం) అనే గ్రంథాన్ని రచించగా, దాన్ని 1985లో ఇండియన్‌కౌన్సిల్ ఆఫ్ ఫిలసాఫికల్ రీసెర్చి (న్యూఢిల్లీ) వారు ప్రచురించారు. దీనిలో ప్రస్తుతం భారతదేశంలో తత్వశాస్త్రం ఎదుర్కొంటున్న వివిధ సమస్యల్ని చర్చించటంతో పాటు ప్రాచీనకాలంనుండి ఆధునికయుగం వరకు భారతీయదార్శనిక చింతనా స్రవంతిని రేఖామాత్రంగా పరిచయం చేశారు. దీనిలో రెండో అధ్యాయంలో - ''భారతదేశంలో దార్శనిక చింతనా చరిత్ర'' లో మన తొలి సమాజకవులైన వేమన, పోతులూరి వీరబ్రహ్మంగార్ల దార్శనిక ధోరణుల్ని సంక్షిప్తంగా అవలోకనం చేశారు. ఇది సంక్షిప్త పరిచయమే అయినా చాలా ముఖ్యమైనదిగా పేర్కొనాలి. యునెస్కోవారికోసం మనదేశానికి సంబంధించిన దార్శనిక స్థితిగతుల్ని నివేదికరూపంలో దీనిలో పొందు పరిచారు ప్రతి నివేదికకు ఉండే పరిమితులు ఈ గ్రంథానికి ఉన్నా, ఇది విశాల దృక్పథంతో రచించబడింది. నివేదిక రచయిత కేవలం ఒక తత్వశాస్త్ర అధ్యాపకుడేకాదు. ఆయన అంతర్జాతీయ ప్రసిద్ధి చెందిన దార్శనికుడు. 1987వ సంవత్సరంలో జర్మనీలోని హాలె విశ్వవిద్యాయం ఆయనకు గౌరవ డాక్టరేట్ ప్రదానం చేస్తూ, వెలువరించిన సైటేషన్ (అధికారకలేఖ) లో ఈ గ్రంథాన్ని గురించి ఇలా అన్నారు '' The standard work of Indian Philosophical history ''భారతీయ దార్శనిక చరిత్రలో ప్రామాణికరచన). ఇటువంటి గ్రంథంలో ఎంత సంక్షిప్తంగా పరిచయంచేసినా, దానికో విలువా, స్థానం తప్పక ఉంటుంది. ఇప్పటివరకు వెలువడిన భారతీయ దర్శన శాస్త్ర గ్రంథాలలో సామాజిక విప్లవరచయితలకు, కవులకు సరియైన స్థానం లభించలేదు. మరీముఖ్యంగా దక్షిణ భారతదేశానికి, అందులో ఆంధ్రదేశానికి సంబంధించిన వారి గురించి మన దార్శనిక రచయితలకు, చరిత్రకారులకు తగినస్పృహ ఉండేదికాదు. అటువంటిపరిస్థితులలో ప్రాంతీయ విభేదాలకు, స్వీయ దార్శనికపక్షపాతానికితావివ్వకుండా దార్శనికవైవిధ్యానికి, భిన్నాభిప్రాయాలకు ప్రాధాన్యం కల్పించిన తత్వశాస్త్ర చరిత్రకారులలో ప్రొఫెసర్ సచ్చిదానందమూర్తి పేర్కొన తగినవారు. వ్యక్తి గతంగా వా రే దార్శనిక సిద్ధాంతానికి కట్టుబడి ఉన్నా, దార్శనిక చరిత్ర రచనలో తమ వ్యక్తి గత విశ్వాసాల ప్రమేయంలేకుండా నిష్పాక్షికతను పాటించే వారిలో వారిని అగ్రగణ్యులనటంలో ఏమాత్రం అతిశయోక్తిలేదు. అందువల్ల మన దార్శనిక కవులు వేమన, పోతులూరి వీరబ్రహ్మంగార్లపై వారి పరిచయం, పరిశీలనకు అంతర్జాతీయంగా చాలా ప్రాముఖ్యం ఉంటుంది.

ప్రస్తుత వ్యాసరచయిత ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఎం. ఎ. చదువుతున్నప్పుడు డాక్టర్ ఎన్. గోపి ''యునెస్కో వీధుల్లో వేమన పద్యాలు'' పేరుతో ''ఆంధ్రప్రభ'' సచిత్ర వారపత్రిక (14-10-81) సంచికలో ఒక వ్యాసం రాశారు. ఆ వ్యాసంలో యునెస్కో వారు వేమన పద్యానువాద బృహత్కార్యాన్ని చేపట్టినట్లు, దానికి కాలిఫోర్నియాలో స్థిరపడ్డ తత్వశాస్త్ర అధ్యాపకులు జె. ఎస్. ఆర్. ఎల్. నారాయణ మూర్తిని ఎన్ను కున్నట్లు, ఇంకొక ఆరునెలల్లో ఈ పని పూర్తవుతుందని తెలియజేశారు డా॥ ఎన్.గోపి పేర్కొన్న ఆ ఆంగ్లాను వాదం యునెస్కో ప్రచురణగా వెలువడిందో లేదో తెలియదుకాని, ఈ మధ్య సాహిత్య అకాడమి వారు '' ఇండియన్ క్లాసిక్స్ సిరీస్'' లో జె ఎస్ ఆర్. ఎల్. నారాయణమూర్తి ఇలియట్ రాబర్ట్స్‌ల వేమన పద్యాల ఆంగ్లాను వాదాన్ని 1995 లో అంతర్జాతీయ విద్యాసాంస్కృతిక సంస్థ ప్రాతి నిధ్య రచనల సంకలనం (Unseco collection of Representative works), ఇండియన్ సిరీస్‌లో ప్రచురించారు. డా॥ఎన్. గోపి పేర్కొన్న ఆ ఆంగ్లాను వాదమే ఇదా, కాదా అనే సందేహం ఎందుకు కలుగుతుందంటే డా॥ నారాయణమూర్తి భారతదేశానికి వచ్చి, ఇక్కడ లభిస్తున్న వేమన పద్యాలన్నింటినీ సేకరించి, వాటిని నిశితంగా అన్నికోణాల్లో పరిశీలించి వేమన పద్యాలుగా రెండు వేల మూడు వందల పద్యాల్ని తేల్చి వాటిలో పదమూడు వందల పద్యాల్ని అనువాద యోగ్యమైనవిగా ఎన్నుకున్నారని తెలిపారు ఇప్పుడు అకాడమి ప్రచురణగా వెలువడిన దానిలో దాదాపు 350కి పైగా పద్యాల్ని మాత్రమే కవితాత్మకత, పఠనీయతను దృష్టిలో పెట్టుకొని ఏరుకున్నారు. అందువల్ల ఇది మరొక అనువాద గ్రంథమా అనే సందేహం కలుగుతుంది. కాని ఇది కూడా యునెస్కో వారి ప్రోద్బలంతోనే వెలువడింది. ఏమయినా వేమనను మరోసారి దేశ విదేశాల్లో సంచరించేట్టు చేసిన యునెస్కోవారికి, అనువాదకులకు తెలుగు వారు ఎంతయినా ఋణపడి ఉన్నారు.

తెలుగువారికి వేమన పేరుగుర్తుకువచ్చిన మరు క్షణం సి పి. బ్రౌన్ పేరు మదిలో మెదులుతుంది. ఆంధ్రదేశంలోని పండితలోకం వేమనను కవిగా అస్పృశ్యుడిగా పరిగణించి, మౌనకుట్రతో ఆయన్ని విస్మరించినసమయంలో వేమనకు ఆంధ్రదేశంలోనే కాకుండా, పాశ్చాత్య ప్రపంచంలో కూడా పునర్జన్మ ప్రసాదించిన వాడు, తెలుగు భాషా సాహిత్యాలకు ఎనలేని సేవచేసిన, సి.పి బ్రౌన్. చిరస్మరణీయుడు. అటువంటి బ్రౌన్‌కు వేమన గురించి మొట్టమొదట సారి తెలిసింది ఫ్రెంచి మిషనరీ ఆబేదుబాయ్ (1770 1848) గ్రంథం ద్వారా. ఆబేదుబాయ్ ''హిందూమేనర్స్, కష్టమ్స్, అండ్ సెరిమనీస్'' (హిందువుల అలవాట్లు, ఆచారాలు, పండుగలు) 1817వ సంవత్సరంలో ప్రచురించబడింది. హిందువుల సాంఘిక చరిత్రను ముఖ్యంగా తమిళ ప్రాంతంలోని హిందువుల సామాజిక చరిత్రను తెలుసుకోవటానికి ఉపకరించే గ్రంథాలలో ముఖ్యమైనదిగా దీన్ని విమర్శకులు పేర్కొంటున్నారు. ఆబేదుబాయ్ రచనగా పేరుపొందిన ఈ గ్రంథం ఆయన స్వంతరచన కాదని ఫోర్జరీ (కూటరచన) అని సిల్వియా మూర్ అనే ఫ్రెంచి పరిశోధకురాలు రుజువులతో నిరూపించినట్లు బంగోరె ''వేమన పద్యాలు'' (సి.పి.బ్రౌన్ 1839 నాటి సంకలనం) కు రాసిన ముందుమాట (1980)లో తెలియచేసినా, ఇప్పటికీ దాన్ని ఆబేదుభాయ్ రచనగానే ఆంధ్రదేశంలోని పరశోధకులు పేర్కొంటున్నారు. ఆదే శోచనీయం. విదేశీ పరిశోధకుల రచనలు మన దృష్టికి రాకపోయినా పర్వాలేదు కనీసం మనవాళ్ళు రాసిన కొత్త పరిశోధనాంశాలయినా మన దృష్టికి రాకపోవటం విచిత్రంగానే ఉంటుంది. ఈ ఫ్రెంచి పరిశోధకు

రాలికంటే ముందు 1863లో ''కర్నాటిక్ క్రానాలజీ'' అనే గ్రంథంలో ఆబేదుబాయ్ ఫోర్జరీ గురించి బ్రౌన్ పేర్కొన్నాడు. ఆదీ మన దృష్టికి రాలేదు దుబాయ్ రచనగా ప్రచారంలోకి వచ్చిన గ్రంథాన్ని రచించిన ఫ్రెంచి రచయితకంటే ముందే 1730 లో ఫాదర్ లీగాక్ 368 పద్యాల కాగితం ప్రతిని ఫ్రాన్సునగరానికి పంపాడు. అది వేమన పద్యాల సంకలనమే కాని అనువాదం కాదు. ఇప్పటివరకు దొరికినవేమనపద్యాల రాత ప్రతుల్లో ఇది అతి ప్రాచీనమైంది. అందువల్లేఆరుద్రలాంటి వేమన పరిశోధకులు ఫాదర్ లీగాక్ పారిస్‌నగరానికి పంపిన వేమన పద్యాల కాగితం ప్రతికి విశేష ప్రాముఖ్యం ఇచ్చారు. కాగితం ప్రతిని ''పారిస్‌నేషనల్ బిబ్లియోరికా'' నుండి డా॥ జె. ఎస్. ఆర్. ఎల్. నారాయణమూర్తి ద్వారా సంపాదించి, సంస్కరించి 1990లో డా॥ ఎన్. గోపి ప్రచురించి ఆంధ్రదేశానికి అమూల్య కానుకగా అందించారు. వేమనపై డా॥ ఎన్. గోపి కృషి మెచ్చుకోదగింది.

ఈ పరిస్థితులలో సాహిత్య అకాడమి ప్రచురించిన జె. ఎస్. ఆర్. ఎల్ నారాయణమూర్తి, విలియమ్ రాబర్ట్స్ ల ''సెలెక్టెడ్ వర్సెస్ ఆఫ్ వేమన'' గ్రంథం ప్రాధాన్యం సంతరించుకున్నది. సి.పి. బ్రౌన్ తర్వాత వేమనపై అనేక పరిశోధనలు వెలువడ్డాయి. అలాగే అనేక వేమన పద్య సంకలనాలు వచ్చాయి (నారాయణ మూర్తి, రాబర్ట్స్‌ల ప్రకారం ఇప్పటికి వేమన పద్యాలు 93 ఎడిషన్లు వచ్చాయి.) వీటిలో ఎక్కువ సంకలనాలు సి.పి బ్రౌన్ 1829, 1839 సంవత్సరాలలో ప్రచురించిన వేమన పద్య సంకలనాలకు ''ఫక్తుకాపీయే'' అని లిటరరీ ఆర్కియా లజిస్ట్ బంగోరే '' మనవాళ్ల చౌర్యాల్ని'' బయట పెట్టాడు. ఎన్నిచేసినా మన బుద్ధి మారదుకదా? భావచౌర్యం, గ్రంథ చౌర్యం మన ప్రాథమిక హక్కులుగా మారాయి. ఒక్క రాజకీయ రంగంలోనే కాదు; అన్నిరంగాల్లోనూ దొంగలుంటారు. జాగ్రతసుమా! ఆ మహాపరిశోధకుడు బంగోరె జ్ఞప్తికి వస్తే తెలియని ఆగ్రహం ఆంధ్రమేధావులపై కలుగుతుంది. మహాకవి శ్రీశ్రీ కీర్తిశేషుడైన తనమిత్రుడి గురించి అన్నట్టు'' దొంగ లంజకొడకు లసలే మెసలే ఈ ధూర్తలోకంలో నిలబడ జాలక తలవంచుకునే వెళ్ళిపోయావా, నేస్తం!'' అనిపిస్తుంటుంది. ఆయన్ని కీర్తి శేషుణ్ణి చేసి మన మేమి కీర్తిని మూటగట్టు కున్నమో తెలియదు కాని బంగోరె మాత్రం '' ఆత్మహత్యా గ్రహం'' ప్రకటించాడు (చూడు! ఖాదర్ మొహియుద్దీన్ : పుట్టుమచ్చ). ''అది ఆత్మ హత్యకాదు - ఒక ఆగ్రహ ప్రకటన'' గానే భావించాలి. ఏమయినా వేమన గుర్తుకొచ్చినప్పుడల్లా ఆంధ్రులకు సి పి. బ్రౌన్, బంగోరెలు వెంటనే గుర్తుకొస్తారు.

అలా బంగోరె మన హృదయాల్లో సుస్థిర స్థానం సంపాదించుకున్నాడు. బ్రౌన్ అనంతరం జరిగిన పరిశోధనల వెలుగులో నారాయణమూర్తి, ఇలియట్ రాబర్ట్స్‌లు తమముందు మాట రాశారు. ఎవరెన్ని పరిశోధనలు చేసినా వేమనకు సంబంధించిన ప్రధాన నిర్ణయాలలో మరల బ్రౌన్ దగ్గరే ఆగిపోతున్నామా అనిపిస్తుంది 1829లో ప్రచురించిన వేమన పద్య సంకల నానికి రాసిన పీఠికలో బ్రౌన్ వేమనను 'జంగమ' మతస్థుడిగా పేర్కొన్నారు. ఆతర్వాత 1839లో ద్వితీయ యెడిషన్‌కు రాసిన పీఠికలో ''వేమన నిజంగా ఏమత శాఖకు చెందడు'' (Vemana indeed belonged to no sect) అని బ్రౌన్ రాశాడు నిజానికి వేమన పద్యాలను నిష్పాక్షికంగా పరిశీలించిన వారికి 1839లో వేమన ఏమత శాఖకు చెందడని బ్రౌన్ రాసినదే నేటికీ సరియైందనిపిస్తుంది. బసవనలో కనిపించే తీవ్రసంస్కరణ భావాలు వేమనలో కనిపించినా, ఆయన వీరశైవుడు కాదని ఆయన పద్యాల్ని పరిశీలిస్తే అర్థమవుతుంది. అందువల్లే 1839లో

బ్రౌన్ అటువంటి అభిప్రాయాన్ని ప్రకటించింది. అయినా నేటికీ కొంతమంది పరిశోధకులు వేమన పద్యాల మొదటి యెడిషన్ లో బ్రౌన్ వేమనను వీరశైవుడిగా పేర్కొన్నదే ఆయన తుది అభిప్రాయంగా భావించి దాన్నే పట్టుకొని వ్రేలాడుతున్నారు. జె. ఎస్. ఆర్. ఎల్. నారాయణ మూర్తి, ఇలియట్ రాబర్ట్స్ లు మాత్రం "he probably did not officially belong to any particular sect" అని చెప్పారు. ఇదే 1839లో బ్రౌన్ చెప్పింది దీన్నే మరోరకంగా ప్రొఫెసర్ సచ్చిదానందమూర్తి ''ఫిలాసఫీ ఆఫ్ ఇండియా'' లో చెప్పారు. ఈ అవగాహనలేకుండా వేమనను ఏదో ఒక మతశాఖకో, దార్శనిక ధోరణికో అంట గట్టటం మంచి పద్ధతి కాదనిపిస్తుంది. మన ఇష్టాయిష్టాలను ప్రక్కన పెట్టి పరిశీలిస్తే ప్రొఫెసర్ సచ్చిదానందమూర్తి అన్నట్టు ''భిన్నమూలాల'' నుండి వేమన తనకు నచ్చినభావాల్ని స్వీకరించాడనటంలో తప్పులేదు. అందువల్లే కె.కె. రంగనాధాచార్యులన్నట్టు ''భిన్నవ్యక్తులకు భిన్నరూపాల్లో దర్శనమిస్తాడు.'' ఆభిన్న రూపాల్ని వదిలేసి వేమనను వేమనగా అర్థంచేసుకోవటానికి ప్రయత్నిస్తే బాగుంటుంది. ఆ ప్రయత్నం ప్రొఫెసర్ సచ్చిదానందమూర్తి వేమనపై రాసిన Mysticism and Egalitarianism in Andhra (ఆంధ్రాలో మార్మిక వాదం, సమతా వాదం) లో కనిపిస్తుంది.

బహుశా తెలుగులో తొలి మత- దార్శనిక గ్రంథంగా మల్లికార్జున పండితారాధ్యుడు రచించిన ''శివతత్వసారము (నాలుగు వందలకుపైగాగల నీతిబోధకపద్యాల సంకలనం) ను పేర్కొనవచ్చు. ఈయన వీరశైవ మత ప్రవక్త బసవేశ్వరుడి సమకాలికుడు. మల్లికార్జున పండితారాధ్యుడు మరో ఇద్దరు పండితులు (శ్రీపతి, శివలెంక మంచన) బ్రాహ్మణీయసామాజిక జీవితాన్ని (వర్ణవ్యవస్థను) శివ భక్తిని సమన్వయం చేయాలని ప్రయత్నించారు. దీనివల్ల ఆంధ్రలోని బ్రాహ్మణుల్లో ప్రత్యేకమైన ఉపకులం ఏర్పడింది. ఆదే ఆరాధ్య బ్రాహ్మణశాఖ. వీరు సాంప్రదాయికవర్ణవ్యవస్థను అనుసరిస్తూ, శైవాగమాల్ని, నాయనార్ల బోధనల్ని ప్రచారం చేసేవారు ఈమత శాఖలోని వారు కర్నాటక లోని బసవేశ్వరుడి అనుచరుల మాదిరి వివిధకులాల నుండి వచ్చి చేరిన వారు కాదు. వారిలాకుల వ్యవస్థను ఖండించిన వారూ కాదు కర్నాటకలోని వీరశైవులు కుల వ్యవస్థను తిరస్కరించినా, చివరకు వారే ఒక ప్రత్యేక కులంగా - లింగాయతులుగా - రూపాంతరం చెందారని ప్రొఫెసర్ సచ్చిదానందమూర్తి వేమనకు పూర్వం ఆంధ్రలోని వీరశైవ మత ధోరణిని పరిచయంచేశారు కులవ్యతిరేక ఉద్యమాలుగా బయలుదేరిన ఉద్యమాలే తర్వాత కాలంలో కులాలుగా మారటం చరిత్రలో ఒక విషాద పరిణామం. ఈ పరిణామాల్ని చూసి నేటి కులనిర్మూలన వాదులు నిరుత్సాహ పడాల్సిన పనిలేదు. పన్నెండవ శతాబ్దంలో ఒక సాంప్రదాయక బ్రాహ్మణకులంలో పుట్టిన బసవేశ్వరుడు ''కులరాహిత్యస్థితి'' ని పొందటం సామాన్యమైన విషయం కాదు. అదిచాలా అభ్యుదయకరమైన అంశం అనటంలో ఎటువంటి సందేహంలేదు. అయితే ఆ ఉద్యమం ఎందుకు వైఫల్యం చెందిందనే విషయంలో మన పండితులకు లోతైన అవగాహన లేదనిపిస్తుంది. నేటి కుల నిర్మూలనోద్యమాల్ని చూసి, నాటి వీరశైవానికి పట్టిన గతే పడుతుందనుకోవటం పొరపాటు వీరశైవం మత ప్రాతిపదికపై బయలుదేరి కులాన్ని వ్యతిరేకించిందే కాని మతాతీతంగా కులనిర్మూలనుగురించి ప్రయత్నించ లేదు. అక్కడే దాని ప్రధాన బలహీనత స్పష్టంగా కనిపిస్తోంది అదేసమయంలో వర్ణవ్యవస్థను అధిగమించలేని పండితారాధ్యుడు లాంటివారు వీరశైవంలోని సామాజిక విప్లవ పార్శ్వాన్ని బలహీన పరిచారు. కర్నాటకలోని బసవనవలె పండితారాధ్యుడు

వర్ణవ్యవస్థపై ధ్వజమెత్తలేదు. ఒక దశలో ''భావుని మీద వలపు, బ్రాహ్మ్యంబుతో పొత్తు పాయలేను నేను బసవలింగ'' అని పండితారాధ్యుడు భావించాడు. కేవలం కులవ్యతిరేకత, ఖండన వల్లే కులనిర్మూలన జరగదు. వీరశైవంలో కనిపించే అభ్యుదయాంశం కులవ్యతిరేకత ఒక్కటే. ఇతర మూఢ విశ్వాసాల విషయంలో దానికీ, ఇతర మతాలకీ పెద్దగా తేడా కనిపించదు. అటువంటి పాక్షిక ఉద్యమం విపరీత పరిణామాలకు దారితీయటంలో ఏమాత్రం ఆశ్చర్య పడాల్సిన పనిలేదు.

వేమన జీవిత, కాలాదుల్ని గురించి చెబుతూ ప్రొఫసర్ సచ్చిదానంద మూర్తి ఆయన క్రీ॥శ॥ 1625 ప్రాంతం వాడనీ, మౌలిక (original) కవే కాకుండా ప్రజలలో ఎంతో ప్రచారం, ఆదరణ ఉన్నవాడని పేర్కొన్నారు. వేమన తన సమకాలిక సామాజిక వ్యవస్థను, మతాన్ని విమర్శిస్తూ, ఆంతరంగిక ఆధ్యాత్మిక వాదం (interior spirituality), మానవ వాదనైతికత (humanistic morality) ను ప్రబోధించే వాడన్నారు. ఆయన వ్యవసాయ శూద్ర కుటుంబం (కాపు) నుండి వచ్చినట్టు కనిపిస్తుందని, బహుశా ఆయన రెడ్డికులానికి చెందిన వాడు కావచ్చని కూడా అభిప్రాయపడ్డారు. వేమన తానేదయితే సత్యమనుకున్నాడో దాన్ని నిర్భయంగా, ఆశువుగా పద్యాల్లో బోధిస్తూ తిరిగే వాడు. నేడు మనకు వేమన చెప్పిన పద్యాలు మూడు నాలుగు వేల వరకు లభిస్తున్నాయి. అవన్ని ఆయన పద్యాలు కాకపోవచ్చు ఇప్పటికీ ప్రామాణికమైన, విమర్శనాత్మకమైన వేమన పద్యాల యెడిషన్ లేదు కాబట్టి ఆయన అధి భౌతిక విశ్వాసాలు (metaphysical beliefs) ఏమిటో నిర్ణయించటం కష్టమని చెప్పటమే కాకుండా వేమన పద్యం ప్రతిదీ దేనికదే పూర్తిగా స్వతంత్రమైంది, సంపూర్ణమైంది అందువల్ల వాటిలో ఏదిముందు చెప్పినది, ఏది తర్వాత చెప్పినదో నిశ్చయంగా నిర్ణయించటం కష్టమంటూ వేమన అంతిమ దృక్పథం (stand - point) పై ఏకాభిప్రాయం లేదన్నారు ఆయన సామాజిక చింతనపై ఎటువంటి సందేహంలేదన్నారు.

వేమన సామాజిక చింతనపై కొన్ని బేధాభిప్రాయాలున్నా మొత్తానికి ఈ విషయంలో ఏకాభిప్రాయమే స్పష్టమౌతుంది. కాని మతభావాలు, ఆధ్యాత్మికచింతన విషయానికి వచ్చేసరికి పలువ్యాఖ్యానాలకు వేమన గురువుతున్నాడు. దానికి కారణం ఆయన తనకాలంనాటి ఏమతాన్ని, దార్శనిక ధోరణిని సమగ్రమైనదిగా భావించలేదు. ఆయనపై భిన్నమత శాఖల భావాల ప్రభావం ఉంది. అందువల్ల తనకాలంనాటి. భిన్న మతశాఖలనుండి తనకు సజీవమనిపించిన, సత్యమనిపించిన అంశాల్ని స్వీకరించి వాటిని సమన్వయం చేయటానికి ప్రయత్నించినట్టు కనిపిస్తుంది ఇటువంటి అభిప్రాయానికి సన్నిహితమైన అభిప్రాయాన్నే ప్రొఫెసర్ సచ్చిదానంద మూర్తి కూడా వ్యక్తీకరించారు "It is clear he was deeply influenced by Siddha, Natha and Virasaiva idealogies (This implies he was familiar with some sunyavada - vijnana Vada and Hatha yoga ideas) and perhaps by Kabir. His deep interest in alchemy and yoga shows the Siddha - Natha impact on him" (ఆయన సిద్ధ, నాథ, వీరశైవ సిద్ధాంతాలవల్ల తీవ్రంగా ప్రభావితుడయ్యాడని స్పష్ట మౌతుంది దీనార్థం ఆయనకు శూన్య వాద, విజ్ఞానవాద, హఠయోగ భావాలతో పరిచయం ఉంది. బహుశా కబీరు ప్రభావం ఉండి ఉండచ్చు. రసవాదం, యోగదర్శనాలపై ఆయనకున్న గాఢమైన ఆసక్తి

ఆయనపై సిద్ధ, నాథ ప్రభావాన్ని తెలియచేస్తుంది). వేమనపై ఏమత శాఖ ప్రభావమున్నా ఆయన ఇహాన్ని (pehnomenal) వదలి పరాన్ని (noumenal) గురించి మాత్రమే ఆలోచించలేదు. తర్కించలేదు ఇహాన్ని వదలితే పరానికి అస్తిత్వమే లేదని చెబుతూ ఇహ, పరాలమధ్య అభేదత్వాన్ని ప్రతిపాదించాడు సహజంగా సన్యాసులకు, యోగులకు ఇహపరమైన విషయాలపై ఉండే విరక్తి వేమనకులేదు '' ఇహములోనే పరము నెసగుట కనవా?'' అని ప్రశ్నించి, మూర్ఖులే పరాన్ని అన్వేషిస్తూ, అది ఇహానికి భిన్నమైందిగా, ఆవల (beyond) గా భావిస్తారని, అలా భావించేవారికి దృఢమైన, అచంచలమైన (Stead - fast) మనసు వృద్ధి చెందదని వేమన ప్రబోధించాడు. నిజంగా పరానికి వ్రేళ్ళు ఇహములోనే ఉన్నాయని, ఇహములో సుఖాన్ని పొందలేకపోతే, పరములో అది ఎట్లులభిస్తుందంటాడు (ఇహమునందు సుఖము లెరుగలేడు, పరమునందునెట్లు పడయవచ్చు). అందువల్ల కొంతమంది చెప్పినట్టు. ఇహాన్ని పరిత్యాజిస్తే, విలువైనదేదో పరములో పొందవచ్చునను కోవటం యదార్థంకాదు. వేమన ప్రకారం అచలతత్వం (immutable Reality) అనుభవం ద్వారా సాధించేదే (అచలతత్వమనగ ననుభవగమ్యంబు). ''అచలభావం బౌద్ధంలోని బోధిసత్వయానంలో ఎనిమిదోదశ వేమన దీన్ని అంతిమ సూత్రం (ultimate principle) గా భావించాడు. బౌద్ధంలో ఇది ఆధ్యాత్మిక దశకు పేరు అచలతత్వం సూక్ష్మమైనది, అది '' ఇది'' అని స్పష్టంగా అభివర్ణించలేము. అది మదికి తెలుస్తుంది (మదికిదోచు) కాని దాని ''మర్మము'' గ్రహించలేము. వేమన దీనికి ''పరమ పదము'' అనేపదాన్ని కూడా ఉపయోగించాడు. ''భావము'' (reality, true state) ఎక్కడో లేదు. అది మన కర్మల (actions) లోనే ఉంది. కాబట్టివేమన ''భావమందు శివుని పరికింపుచుండుము'' అన్నాడు. అంతేకాదు ''అన్నిట బరికింప విష్ణువరయుచుండు'' అనికూడా చెప్పాడు ''మనము బ్రహ్మమనుచు; తాను సకలంబైన తనలోన సకలంబు, తన్నుతానెరిగిన తానెపో బ్రహ్మంబు'' అంటూ వేమన తన అతిభౌతిక భావాల్ని ప్రచారంచేశాడు.

వేమన దార్శనిక చింతనలో అత్యంతముఖ్యమైనది ఆయన సామాజిక చింతన. దీనివల్లే నేటికీ వేమన ఒక రాడికల్ చింతనా పరుడిగా పరిగణించబడుతున్నాడు ఆయన సామాజిక భావాల్ని గురించి చెబుతూ ప్రొఫెసర్ సచ్చినానందమూర్తి ఇలా అంటున్నాడు "He rejected the authority of the Vedas and puranas or any other scripture and religious doctrins and practices based on them, but not of the guru, he repudiaed the caste system, idol worship, fatalism, pilgrimages and all rituals and superstitions" (ఆయన వేదాల, పురాణాల అధికారాన్ని తిరస్కరించాడు. వాటిపై ఆధారపడిన మరేవిధమైన పవిత్ర గ్రంధాన్ని, మతసిద్ధాంతాల్ని, ఆచారాల్ని అంగీకరించలేదు. కానపి 'గురువు' ను తిరస్కరించలేదు. కులవ్యవస్థను, విగ్రహారాధనను, విధివాదాన్ని, తీర్థయాత్రల్ని, అన్నిరకాల మత క్రతువుల్ని, మూఢ విశ్వాసాల్ని నిరాకరించాడు) వేమన తన కాలంనాటి మతాధికారాన్ని, సమస్త మూఢవిశ్వాసాల్ని తనదైన సొంతగొంతుకతతో తీవ్రంగా నిరసించాడు, ఖండించాడు, తిరస్కరించాడు ఆయన దృష్టిలో ''భేద గుణం'' ఉన్నవాడు సాధువేకాదు ప్రొఫెసర్ సచ్చిదానందమూర్తి వేమనను దక్షిణ భారతదేశానికి ఒక రకమైన సరాహపాదుడి (He was a sort of sarah of South India) గా అభివర్ణిస్తూ, ఆయనకంటే వేమన ప్రగతిశీలి

అని, తనకాలంనాటి రాజకీయ వ్యవస్థను కూడా ధైర్యంగా విమర్శించాడన్నారు ఆయన రైతుల్ని, శ్రామికుల్ని దోపిడిచేసే పాలక వర్గాల్ని ('రాచముక' పేరుతో నిరసించాడు) విమర్శించాడు. అంతేకాదు ఈ విషయంలో రైతుల్ని, శ్రామికుల్ని చైతన్యవంతుల్ని చేయటమే వేమన ''మిషన్'' గా కనిపింస్తుందంటారు ప్రొఫెసర్ సచ్చిదానందమూర్తి. వేమన వడ్డీ వ్యాపారుల్ని, భూస్వాముల్ని, సంప్రదాయానికి బానిసలైన మేధావుల్ని ఎగతాళి చేశాడు వారిజీవన విధానాల్ని పరిహసించాడు. వేమనకుముందు ఏ భారతీయ చింతనా పరుడు శ్రామికుల దీనావస్థను చూసి ఆయనకంటే ఎక్కువ చలించలేదు (No other Indian thinker before him seems to have been moved more by the plight of the toiling masses). దారిద్ర్య నిర్మూలనకు ఆయనలాగా తీవ్ర వాంఛకలిగినవారు లేరు. సాంఘిక భేదాలతో పాటు, ఆర్థిక అసమానతల్ని కూడావేమన తీవ్రంగా గర్హించాడు. సమాజాన్ని నిశితంగా పరిశీలించినవేమన శ్రమశక్తి ప్రాధాన్యాన్ని గుర్తించాడు. ఒక పద్యంలో ''శ్రమములోన పుట్టు సర్వము తానేను'' అని శ్రమలోంచే అన్నీ పుడతాయని శ్రమశక్తికి ఎనలేని విలువను ప్రసాదించాడు. ప్రభుదేవ శ్రమను పవిత్రమైందిగా, పదేహేనవ శతాబ్దికి చెందిన ఉత్తరదేశపు చమార్ సాధువు రవిదాస్ శ్రమేదైవమని పేర్కొన్న విషయాన్ని మరవకూడదు. ఒకపద్యంలో వేమన ధనవంతులనుండి ధనాన్ని దౌర్జన్యంగానయినా తీసుకొని పేద వాళ్ళకు ఇవ్వమంటాడు ప్రజల వాస్తవ స్థితిగతుల్ని పట్టించుకొని, వారిని అన్యాయానికి, అంధవిశ్వాసాలకు వ్యతిరేకంగా తిరగబడమని ప్రబోధించిన గొప్పకవి (great poet), ఆధ్యాత్మిక నాయకుడు (Spiritual leader) వేమన మత సామాజిక - రాజకీయ ఆచారాల్ని, నిబంధనల్ని విమర్శించటమే దర్శనమయితే ఆయన చెప్పిన దానిలో హెచ్చు భాగం దర్శన మేనంటారు ప్రొఫెసర్ సచ్చిదానందమూర్తి. రాయలసీమలోని కోడిరెడ్లు (రెడ్లలోని ఉపకులం) వేమన అనుచరులయి, ఆయన సాహిత్యాన్ని మౌఖికంగా ప్రచారం చేయటానికి అంకితమయ్యారు. అదేకాలంలో తెలంగాణాలోని కొంతమంది బ్రాహ్మణులు అచలమతం అనే పేరుతో ఒక సిద్ధాంతాన్ని అభివృద్ధిచేసి, అది వేమన బోధలపై ఆధారపడిందని చెప్పే వారు చివరకు అచలమతం మూలాన్ని యాజ్ఞ వల్క్యుడిలో చూపేవారు. వారి ముఖ్య సిద్ధాంతం - ''బ్రహ్మన్'' అనేది పరిపూర్ణమైందని, అచలమైందని చెబుతూ దాన్ని మాటల్లో వ్యక్తీకరించలేమంటారు వాళ్ళు ఏ పవిత్ర గ్రంథాన్ని, కులాన్ని, యోగాన్ని, కర్మకాండను, సన్యాసాన్ని అంగీకరించరు ఒక్క ''గురువు'' అధికారాన్నే అంగీకరిస్తారు. తర్వాత కాలంలో బ్రాహ్మణేతరులు కూడా ఈ మతశాఖకు గురువులైనారు ఇదంతా వేమన తర్వాత నూరు, నూటయాభైసంవత్సరాల తర్వాత జరిగి ఉండవచ్చు. 1928 నుండి ఆంధ్రదేశంలోని కొంత మంది హేతువాదులకు, ప్రగతి శీలురకు వేమన ''రక్షకఋషి'' (Patraon Saint) గా మారాడు

ఈ విధంగా వేమన అధిభౌతిక భావాల్ని, సామాజిక చింతనను, తర్వాత కాలంలోని ఉద్యమాలపై ఆయన ప్రభావాన్ని సంక్షిప్తంగా పరిచయంచేసి, అంతర్జాతీయ స్థాయిలో ఒకదేశపు అధికారనివేదిక లో స్థానం కల్పించి, వేమన చింతనకు దార్శనిక స్థాయినందించి, భవిష్యత్ తరాలకు ప్రొఫెసర్ సచ్చిదానందమూర్తి ఆదర్శ ప్రాయులైనారు

* * *

# గౌతమ బుద్ధుడు - సోక్రటీస్

- కొండిపర్తి శేషగిరి రావు

నిండుపున్నమినాడు ఒక మహానుభావుడు ఉదయిస్తుంటే, మరో మహానుభావుడు అస్తమిస్తున్నాడు

వెన్నెలరాజు ఉదయిస్తుంటే, దినరాజు అస్తమిస్తున్నాడు. ఆమరునాడు వెన్నెలరాజు అస్తమిస్తుంటే, దినకరుడు ఉదయిస్తున్నాడు

అలానే -

ఈలోకంలో ఓ మహానుభావుడు అస్తమిస్తుంటే, మరో మహాను భావుడు ఉదయిస్తున్నాడు

ఇది కాలవైచిత్రి

తూర్పుదేశాలలో గౌతమబుద్ధుని అస్తమయం జరిగితే; పశ్చిమ దేశాలలో సోక్రటీసు ఉదయించటం జరిగింది.

కాకపోతే ఈ అస్తమయానికీ ఉదయానికీ మధ్య ఓ పన్నెండు సంవత్సరాలు తేడా. అనంతకాలంలో అది ఓక్షణం అది ఓ సంధ్యాసమయం. తాత్త్విక జగత్తులో.

గౌతమబుద్ధుడు సోక్రటీసూ తాత్త్విక జగత్తులో నూతన పథాలను ఆవిష్కరించినవారే. అప్పటికి ఆయాసమాజాలలో ఉన్న మూఢతను తొలగించ ప్రయత్నించినవారే వీరిరువురూ ఈ ఉభయులూ సమాజాన్ని తర్కంతో జ్ఞానమయం చేయతలపెట్టినవారే సృష్టికర్తను గురించి వీరు విశేషంగా విశ్లేషించలేదు. సామాన్యుని నుండి జ్ఞానుల వరకూ చర్చలు జరిపారు అతి సామాన్యమైన ఉదాహరణలతో ఉపమానాలతో తత్త్వాన్నీ తత్త్వజ్ఞానాన్నీ అందివ్వ ప్రయత్నించారు మేధావుల నుండి జ్ఞానుల వరకూ శాస్త్రీయంగా చర్చలు జరిపారు తీవ్రమైన ఆలోచనలను అందరిలోనూ రేకెత్తించారు. తమ వ్యక్తిత్వంతో స్వేచ్ఛా చింతనను చేయగల సామర్థ్యాన్ని జిజ్ఞాసువులకూ సామాన్యులకూ ప్రసాదించ ప్రయత్నించారు ఇద్దరూ నాటి మేధావి వర్గానికి తిరుగుబాటు దారులే. ఎన్నో ప్రతిఘటనలను ఎదుర్కొన్నవారే. వీరిద్దరినీ సాంప్రదాయవాదులు నిరీశ్వరవాదులుగా పరిగణించారు అలాంటి గౌతమ బుద్ధుడు సోక్రటీసు ఆనాటి రాచరికపు వ్యవస్థచే శిక్షను పొందారు. కాకపోతే, ఒకరు మరణ శిక్షను సూటిగా పొందితే, మరొకరు దేశబహిష్కరణను పొంది, మరణంతో సమానమయిన సర్వసంగపరిత్యాగం చేసి సన్యాసాన్ని స్వీకరించారు. ఆ తరువాత వీరిని శిక్షించిన వ్యవస్థలు పాశ్చాత్తప్తతను పొందాయి. శిక్షలు పొందిన వీరిరువురూ ఆనాటి రాజ్యాంగాన్ని గౌరవించి శిరసావహించారు

ఇలా గౌతమ బుద్ధునికీ సోక్రటీసుకీ ఎన్నో బాహ్య అంతర్ సామ్యాలు ఉన్నాయి

సోక్రటీస్‌కు మరణశిక్ష విధించిన తరువాత అతని సహచరుడు క్రిటో సోక్రటీసుతో నీవు ఈ శిక్షనుండి తప్పించుకొని మరో రాజ్యానికి ప్రవాసిగా వెళ్లటానికి ఏర్పాట్లు జరిగాయి. ఏ ప్రమాదమూ లేకుండా నిన్ను ఈ కారాగారమునుండి ఈ రాజ్యమునుండి తప్పిస్తాము అని అంటాడు దానికి సోక్రటీసు అంగీకరించడు అప్పుడు వీరుభయుల మధ్యా చాలా లోతైన సారవంతమైన సుదీర్ఘమైన చర్చలు జరుగుతాయి.

చివరకు సోక్రటీస్ క్రిటోతో ఒక భగవద్భక్తుని హృదయంలో మురళీధ్వని మారుమ్రోగినట్లే ఇదంతా నాహృదయంలో మంద్ర మంద్రంగా మారుమ్రోగుతున్నది. ఈ వాణి నా శృతి కుహరాలలో నెమ్మది నెమ్మదిగా ప్రతిధ్వనిస్తూ మరొకటి ఏదీ విననీయడం లేదు! ఇక ఈపైన నీవేమి చెప్పినా, అది ఎందుకూ కొరగాకుండాపోతుందని నేనెరుగుదును, అయినా నాకింకా ఏమయినా చెప్పవలసినది ఉంటే చెప్పవచ్చును క్రిటో!

క్రిటో: సోక్రటీస్! మరి నేను వేరే చెప్పవలసినదేమీ లేదు

సోక్రటీస్: అయితే పరమేశ్వరుని ఇచ్ఛప్రకారం నడుచుకోడానికే, ఆయన ఎటునడిపిస్తే అటు నడవడానికే నన్ను పోనీయి నాయనా!

అలానే గౌతమ బుద్ధుడు తన అంతిమ దశలో ఆనందునితో, సోక్రటీసు క్రిటోతో అన్నట్లుగానే ' ఆనందా నాగురించి యెటువంటి శ్రమా పడవద్దు. యేడవ వద్దు. మనకు ప్రియమైన, మనకు మిక్కిలి సమీపములైన పదార్థాల స్వభావమే యిటువంటిదనీ, అన్నీ నశించిపోయేవే' అని అంటాడు.

గౌతమ బుద్ధుడు సర్వసంగపరిత్యాగము చేసి సంచారం చేస్తూ మగధరాజ్యానికి వచ్చాడు మగధరాజైన బింబిసారునికి ఈ వార్తతెలిసి తానే స్వయంగా బుద్ధుని వద్దకు వస్తాడు అప్పుడు వారిద్దరి మధ్యా చాలా సుదీర్ఘమైన చర్చజరుగుతుంది. క్రిటో సోక్రటీసును ఎలా మరణ శిక్ష నుండి బయటపడేయాలని ప్రయత్నిస్తాడో, అలానే బింబిసారుడు బుద్ధుని పరివ్రాజ కత్వము నుండి విరమింపజేయటానికి ప్రయత్నిస్తాడు. అందుకు బుద్ధుడు బింబిసారునికి భారతీయ తాత్త్విక ధోరణిలో సమాధానం చెబుతాడు

బింబిసారుడు అంటాడు. ' ఈ నీబాహువులు ఇతరుల రక్షణార్థం ఉపయోగించవలసినవి. భిక్షాపాత్రను ధరించవలసినవి కావు. అందువల్ల నీకు నీపిత్రురాజ్యాన్ని ఏలడానికి యిష్టం లేకపోతే, నా రాజ్యంలో సగం ఇస్తాను. 'అలానేను నీకు రాజ్యాన్ని ఇవ్వటం అన్నది నీరాజవంశానికి భంగంగా భావిస్తే, నీవు యుద్ధానికి సన్నద్ధుడవై శత్రువులను (కొలీయాలను) జయించటానికి బయలుదేరు. నీకు నాసహాయం పూర్తిగా ఇవ్వగలను'. ఇలా ఎన్నోరకాలుగా బింబిసారుడు అంటే, ' భిక్షాటనతో జీవించేవాడిని చూచి జాలిపడనక్కరలేదు. అతడు పరిపూర్ణసుఖము, సంతృప్తిగల వాడౌతాడు. దుఃఖాలు అతనికి పటాపంచలైపోతాయి ' అని గౌతమ బుద్ధుడు అంటాడు.

అంతేగాదు 'నేను లోకంలోని సంఘర్షణ, వివాదాలకు, క్షోభితుడనై శాంతికోసం బయలు వెడలివచ్చాను.' అని తన దృఢనిశ్చయాన్ని చెబుతాడు.

అప్పుడు బింబిసారుడు, 'మీరు నిరాటంకంగా మీ అభీష్టాన్ని నెరవేర్చుకోవచ్చును. మీరు కోరినవాటిని సాధించిన తరువాత నాయందు ఆదరణ చూపాలి' అని గౌతమ బుద్ధునితో అంటాడు.

ఎవరు ఎంతగా చెప్పినా, ఎన్ని చర్చలు చేసినా గౌతమ బుద్ధుడు తన మరణ సాదృశ్యమైన పరివ్రాజకత్వాన్ని వదలలేదు. సోక్రటీస్ క్రిటో ఎంత చెప్పినా తన మరణ శిక్షకు దూరంగా పారిపోలేదు. పైగా ' నీప్రస్తుత తాత్త్విక ధోరణి పూర్తిగా విసర్జించాలి మళ్లీ ఇలాంటి పని గనుక చేస్తే

ఇక నీకు మరణశిక్షే, అని అంటే. అలాంటి సమయంలో కూడా సోక్రటీస్ ఇలా అంటాడు. 'నాశరీరంలో ప్రాణం ఉన్నంత వరకు, జవసత్వాలున్నంత వరకు నాతత్త్వ శాస్త్రబోధనలు విరమించదలుచుకోలేదు. ఎదురు పడ్డవారెవరితోనయినా నాకు అలవాటయిన ధోరణిలోనే ప్రసంగిస్తాను.' వీరుభయులకూ అప్పటి రాజ్య నిబంధనలు శిక్షలు విధించినా ఆ నాటి న్యాయవ్యవస్థపై వారికి దృఢవిశ్వాసం ఉంది. శిక్షలను శిరసావహించారు. వీరుభయులకూ తెలుసు తాము తాత్త్విక జగత్తులో స్వేచ్ఛా చింతన పరులమని. కానీ వారి వాదాలను అప్పటి న్యాయవ్యవస్థ సమాజమూ అంగీకరించలేక పోతోందని కూడా తెలుసు అయినా ఆశిక్షలకు వారు తలవంచి గౌరవించారు.

సోక్రటీస్ యువతను జ్ఞానవంతులనూ వివేచనాపరులనూ చేసి, విజ్ఞానాన్నీ తాత్త్వికతనూ వారికి పంచప్రయత్నిస్తే; గౌతమబుద్ధుడు కొలియాలు-శాక్యులు రోహిణీనది నీటి విషయమై ప్రతి సంవత్సరమూ వచ్చే సంఘర్షణల విషయమై సామరస్యంగా సంప్రదింపులు జరుపుకొని సమస్యా పరిష్కారం చేసుకోవాలి, హింస ప్రతిహింసలు వద్దు అన్న ప్రతిపాదన చేశాడు అందుకు సేనాపతులనుండి ప్రతిఘటన వచ్చింది. ఈ ఉభయులను ఓటింగ్‌పెట్టి మెజారిటీ ప్రకారం శిక్షార్హులుగా నిర్ణయించారు.

కాకపోతే సోక్రటీస్ జిజ్ఞాసువుగా సుదీర్ఘమైన ప్రయాణంచేసి తాత్త్విక జగత్తులో పండిపోయిన తరువాత జీవిత ఉత్తరార్ధపు చివరి దశలో మరణశిక్షను పొందాడు గౌతమ బుద్ధుడు జీవిత ప్రారంభంలోనే శిక్షనుపొంది ( ఇరవైతొమ్మిదవ ఏట) పరివ్రాజకుడై తనలో అణిగి ఉన్న జిజ్ఞాసను ఓ ఆలంబనగా, ఓ ప్రేరణగా తీసుకొని గొప్ప జిజ్ఞాసువు అన్వేషకుడు ఐ తాత్త్విక జగత్తులో తాత్త్వికుడైనాడు.

గౌతమ బుద్ధుడు సోక్రటీస్‌ల ప్రవచనాలను కొన్నిటిని పరిశీలిస్తే, వాటిలో కొన్ని సామ్యాలు కనిపిస్తాయి.

సోక్రటీస్ తమకంతా తెలుసు తామే సర్వజ్ఞుల మనుకొనే తాత్త్వికులను గురించి అంటాడు 'నాకే అంతటి విజ్ఞానం ఉంటే నే నెంతయినా గర్వపడి ఉందును. అసలు కథ ఏమంటే నాకటువంటి విజ్ఞానమే లేదు'. సోక్రటీస్ జ్ఞానానికి ఎంత వినయసంపన్నుడో దీనివల్ల తెలుస్తూవుంది అలానే గౌతమ బుద్ధుడు కూడా అళార కాలముడివద్దా, ఉద్దాక రామపుత్రుని వద్దా శెలవుతీసుకుంటూ 'మీరెంతో ప్రేమతో నాకు జ్ఞాననిధి అంతా తెల్పారు భవిష్యత్తులోనేను సాధించబోయే దానికి మీరునేర్పిన విద్య పునాదివంటిది ఇప్పటికినేను తెలుసుకున్న సంగతులూ, తత్త్వ శాస్త్ర విషయాలూ, యివేమీ తక్కువ శక్తికలవి కాదు. వాటిలో గొప్పమహాశక్తివుంది. మనుష్యులు సక్రమమైన దారిలో సుఖంగా జీవించాలన్న కోరికవుంది కానీ యేసిద్ధాంతమూ నేను కోరుకున్న విశ్వమానవుడ్ని తయారుచెయ్యలేదు' అని ఎంతో వినయంగా తాను నేర్చుకున్న తాత్త్విక జ్ఞానానికి కృతజ్ఞతలు-తెలుపుకుంటూ, తన అన్వేషణను జిజ్ఞాసలో గల తన ధ్యేయాన్ని చెప్పాడు

ఈ ఉభయ జిజ్ఞాసువులకూ తాము ఆర్జించిన తాత్త్విక జ్ఞానం మీద తృప్తి కలుగలేదు. ఎంతో వినయంగా అన్వేషణలో ముందుకు సాగారు సోక్రటీస్ గౌతమ బుద్ధుడూ ఇద్దరూ ఎంతో మంది మేధావులతో సామాన్యులతో వాదోపవాదాలు జరిపారు.

సోక్రటీస్ 'నేనొక వ్యక్తి దగ్గరకు వెళ్ళాను అతను విజ్ఞాని అన్న ఖ్యాతి ఉన్నది. ఆ వ్యక్తి ధోరణి జాగ్రత్తగా పరిశీలించాను. అతని పేరిక్కడ పేర్కొనవలసిన అవశ్యకతలేదు. అతడొక రాజకీయవేత్త. కనుకనే ఆయన ధోరణి పరిశీలించవలెనని అనుకున్నాను. నా పరిశీలనా ఫలితం ఇక్కడ నివేదిస్తున్నాను. కొంచెం సేపు ప్రసంగించిన తరువాత ఆయన నిజంగా వేత్తకాడని బోధపడింది కానీ విజ్ఞానవంతుడని చాలామంది భావిస్తున్నారు. ... ... .. అక్కడనుంచి తిరిగి వచ్చేశాను. మార్గమధ్యంలో నేనిలా అనుకున్నాను. నిజంగా శివము, సుందరము అయిన తత్వాన్ని గురించి అతనికి గానీ నాకుగాని ఏమీ తెలియదు. కాని ఆ వ్యక్తికంటె నేనేనయం. ఆయనకేమీ తెలియదు. అయినా తనకు తెలుసునని అనుకుంటున్నాడు. నాకూ ఏమీ తెలియదు. తెలుసునని కూడా అనుకోవటంలేదు. ప్రత్యేకంగా ఈ రెండవ విషయంలో అతనికంటే నేనే చూపువాసినయం అని తోచింది'. అని అన్నాడు. సోక్రటీస్ ఇలా ఎంతో ఓర్పుతో ప్రశాంతంగా ఎలాంటి కోపతాపాలు లేకుండా తన అన్వేషణను సాగించాడు.

అలానే ఈ జ్ఞానసముపార్జనలో జ్ఞానబోధలో ప్రయాణిస్తూ గౌతమ బుద్ధుడు శిష్యులతో అంటాడు గదా 'మీతో మనుష్యులు యుక్తంగా మాట్లాడవచ్చు. లేదా అమర్యాదగా యుక్తంకాని విధంగా మాట్లాడవచ్చు. నిజం మాట్లాడవచ్చు, అబద్ధాలు మాట్లాడవచ్చు. కరుణగా మాట్లాడవచ్చు నిర్దయగా మాట్లాడవచ్చు యోగ్యమైన మాటలు మాట్లాడవచ్చు. లేదా నిరుపయోగంగా మాట్లాడవచ్చు. సహానుభూతితో మాట్లాడవచ్చు. అయినా మీ మనస్సులు ఆందోళనచెందకుండా, ఒక్కమాటకూడా మిమ్మల్ని బాధపెట్టకుండా ఉండేటట్లుగా మీ మనస్సుల్ని సమాధానపరుచుకొండి.' అని.

సోక్రటీస్ ఎలా జ్ఞానార్జనతో సమాజకులతో ఎంత ఓర్పుగా ఉన్నాడో గౌతమ బుద్ధుడు జ్ఞానార్జనలోనూ జ్ఞానబోధలోను అంతే ఓర్పు కావాలని అన్నాడు.

గౌతమ బుద్ధుడు 'జ్ఞానార్జన అందరికీ అందుబాటులో చేయగలగాలి. అలాగని జ్ఞానసముపార్జన మాత్రమే చాలదు. ప్రజ్ఞచూపగలగాలి. ప్రజ్ఞమాత్రమే చాలదు. దానికి శీలంతోడుకావాలి.' అంతేగాదు 'జ్ఞానం సంపాదించటంతో సరిపోదు ఆ జ్ఞానాన్ని పదిమందికీ పంచాలి, బోధించాలి. అప్పుడే అతడు జ్ఞాని అని అనిపించుకుంటాడు పదిమందికీ బోధించని జ్ఞానం వ్యర్థం' అని అంటాడు.

సోక్రటీస్ విపణి వీధులలోగల కూడలుల వద్ద చర్చలు జరిపేవాడు, బోధలు చేసేవాడు. అలానేగౌతమ బుద్ధుడు కూడా, 'దారిలో నీకు మంచిస్నేహితుడు లభ్యమైనాడా! నిర్భయత్వాన్ని గురించి, జ్ఞానం గురించి చర్చించుకొని అతనికి సాదారంగా వీడ్కోలు ఇవ్వు' అని అంటాడు

న్యాయస్థానంలో ఓటింగ్‌పై సోక్రటీస్ అంటాడు 'అయితే వ్యతిరేకంగానూ అనుకూలంగానూ పడిన వోట్లు చాలవరకు సమంగా ఉండడం నాకాశ్చర్యం కలిగించింది. ఎన్నో వోట్లు నాకు వ్యతిరేకంగా పడగలవని అనుకున్నాను. ఇవతలి పక్షం వారికి 30 వోట్లు ఎక్కువగా వచ్చి ఉంటే నేను విడుదలపొంది ఉండేవాడిని'. (సోక్రటీస్‌కు వ్యతిరేకంగా 280 ఓట్లు అనుకూలంగా 220 ఓట్లు) అని తనను విచారించిన న్యాయవ్యవస్థపై తప్పుపట్టలేదు. అలాగే గౌతమ బుద్ధుడు 'యితరులు నన్ను నిందిస్తూ మాట్లాడినా, అదేవిధంగా ధర్మం గురించి, సంఘం గురించి

మాట్లాడినా, అతను మాట్లాడిన ప్రతిమాట యెలా అసత్యమో విడదీసి చూపించి, అది యెంత తప్పో నిర్ధారించి యిలా మృదువుగా చెప్పాలి. ఈ కారణం వల్లగానీ, ఆహేతువువల్లగానీ యిది వాస్తవంగాదు అది అలాకాదు. అలాంటిది మాలో కనిపించదు. అది మాలోలేదు . . .. . . యీ కారణంవల్ల అది యదార్థం. అది నిజమే అది మాలోనూ వుంది'. అంటూ, 'అహంకరించకుండా, గాయపడకుండా, వినయంగా, కరుణజ్ఞానాన్ని బోధించడమే వొకజ్ఞానికి, మేధావికి, ఉపాధ్యాయునికి, బోధికి, భిక్షువుకి వుండవలసిన గుణం' అని అన్నాడు.

గౌతమ బుద్ధుడు తన అంతిమ దశలో కుశీనగరానికి ప్రయాణమై 'పావా' అనేవూరికి చివరగల మామిడితోటలో బసచేశాడు ఆ తోట చుండుడు అనే అతనిది అతను బుద్ధుని అనుయాయుడు. బుద్ధుని తన గృహానికి ఆహ్వానించి తృప్తిగా భోజనం పెడుతాడు. కుశీనగరం చేరినతరువాత బుద్ధుడు ఆనందుని పిలిచి 'ఆనందా! మృత్యుకాలం సమీపిస్తోంది దీనికి కారణం చుండుడు అని ఎవరైనా అతడిపై నిందవేయవచ్చు. ఆనింద అతనిపై రాకుండా చూడండి. అతడు నాపై యెనలేని ఆప్యాయత, ప్రేమాభిమానాలు చూపించాడు'. అని అంటాడు.

సోక్రటీస్ క్రిటోతో తాను పారిపోతే, తనకు మరణ శిక్ష విధించిన న్యాయసూత్రాలు ఈ విధంగా అంటాయని చెబుతాడు.

'సోక్రటీస్! నీకు కళ్ళుమూసుకుని ప్రశ్నలగడమూ, సమాధానాలు చెప్పటమూ ఒకపరిపాటి! మేమడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పు! . . . . . . నీ అస్తిత్వానికి మేమే గదా కారణం మా సహాయం వల్ల నీ జననీ జనకులు వివాహం చేసుకున్నారు. వారికి నీవు జన్మించావు. ఈ విధంగా వివాహధర్మాన్ని అనుశాసించే సూత్రాల విషయంలో నీకేమయినా అభ్యంతరం ఉన్నదా' ఈ ప్రశ్నలకు నేనేవిధమైన సమాధానం చెప్పాలి. మళ్ళీ ధర్మసూత్రాలు నన్నీవిధంగా ప్రశ్నించవచ్చు.

మాలో కొన్ని ధర్మసూత్రాలు శిశువులు జన్మించిన తరువాత వారి పోషణగురించీ, వారి విద్యాభ్యాసాన్ని గురించీ కొన్ని నియమాలు విధిస్తున్నాయి ఆ నియమాల ప్రకారమే నీవు సుశిక్షితుడవయ్యావు. వ్యాయామంలోనూ సంగీతంలోనూ నీకు శిక్షణ ఇవ్వవలసిందని ఆ నియమాలు నీ జనకుని ఆదేశించాయి.

ఇది న్యాయమే కదా?

దీనికి అవును! ఇది న్యాయమే అని నేను సమాధానం చెప్పాలి . . .

ఈ విధంగా నీవు మా సంతానమయినావు! మా సేవకుడవయినావు! ఇది కాదనగలవా? . . . . . . దేశానికి నీ మీద ఆగ్రహం కలిగినప్పుడు తల్లిదండ్రులకన్నా ఎక్కువ గౌరవభావంతో బతిమాలుకోవాలి. ఒకవేళ దానివల్ల ఫలితం కలుగకపోతే మాతృదేశ శిక్ష శిరసావహించాలని నీకు తెలియదా? .. ...

దానికి మన మే విధంగా సమాధానం చెప్పాలి క్రిటో ధర్మసూత్రాలు నిజం చెబుతున్నాయంటావా? లేదంటావా?

క్రిటో అవి నిజమే చెబుతున్నాయి

ఇలా సో(క్రటీసు గౌతమ బుద్ధుడు ఇతరులమీదా, అప్పటి న్యాయసూత్రాల మీదా, తమ వల్ల మాటరాకుండా ఎంతో జాగ్రత్త పడ్డారు

అంతే కాదు ఈ జిజ్ఞాసా ప్రయాణంలో సేచ్ఛాచింతనను గురించి గౌతమ బుద్ధుడు అంటాడు గదా 'యెవరైనా వొక నూతన తత్త్వాన్ని అలవరచుకోవాలంటే వారికి వుత్తమమైన మార్గం వొక్కటే. వారు సంతోషం కోసం పాకులాడకూడదు. మనస్సుని శాంతపరచుకోవాలి. నేనెవరినీ స్వేచ్ఛా జీవులుగా తయారు చెయ్యలేదు వారే యిందుకు సన్నద్ధమవ్వాలి ' అని గౌతమ బుద్ధుడు అంటూ; 'యెన్నిసార్లు తెలుసుకున్నా సత్యం అమర ప్రవాహమే ... ... ... ప్రతిసారీ క్రొత్తలోతులు తెలుస్తాయి. మనస్సు మరింత విశాలమవుతుంది.' అని అనంతమైన శాశ్వత సత్యాన్ని ఆవిష్కరించాడు.

సో(క్రటీసు జ్ఞానాన్ని గురించి 'జ్ఞానమే ఒకరకమైన పరిశుద్ధత' అని అంటూ, 'మన జ్ఞానం అంతా ఎక్కడనుంచి వచ్చింది? ఈ వివరాలలో నుంచి వచ్చిందిగదా సమానమైన రాళ్లు, కర్రలు, వస్తువులు చూచినందువల్ల మనకు సమానత కళ్లకు కడుతుంది. ఇందాకటి సూత్రాన్ని బట్టి, సమానంగా కనిపిస్తున్నా వస్తువులన్నీ అసమానతలనుంచి వచ్చాయి సమానత అంటేనే అసమానత' అని అంటాడు.

మరణాన్ని గురించి సో(క్రటీస్ గౌతమ బుద్ధుడు ఇలా అంటారు

'అది (మరణం) కేవలం శూన్యస్వరూపమని, ఆస్థితిలో చైతన్యం ఏమీ ఉండదనీ కొందరంటారు మరణానంతరం ఆత్మ ఈ లోకంలోనుంచి ఇంకొక లోకానికి వెళ్లుతున్నదనీ, మరణం అంటే మార్పేననీ మరికొందరంటారు అది చైతన్యము, స్వప్నములు ఏవీ లేని ప్రశాంత సుషుప్తే అయితే, మృతివల్ల చాలా, గొప్ప లాభమే కలుగుతున్నదన్నమాట' అని సో(క్రటీస్ అంటూ, 'మిగిలిన రాత్రులతో సరిపోల్చి చూచినప్పుడు కలలు మొదలైనవి రాని రాత్రి చాలా గొప్పదని అనిపిస్తుంది. ఒక సామాన్యమైన వ్యక్తికాదు, మహారాజుకూడా అదే ప్రశాంతమయిన నిశీధమని అనుకుంటాడు. మృత్యువు అలాంటి ప్రశాంత రాత్రే అయితే అది చాలా లాభమే అనీ, ఆనందదాయకమే అనీ అనాలి. అనంత తత్త్వమంటే అటువంటి రాత్రే ' అని వివరించాడు సో(క్రటీస్.

గౌతమ బుద్ధుడు మరణాన్ని గురించి ' ఆ నిర్యాణ స్థితిని వర్ణించటానికి మాటలు చాలవు సుఖదుఃఖాలకు అతీతమైనస్థితి అది స్థితిలయలకు అతీతంగా వుండే శూన్యస్థితి అది అద్భుతమైన ప్రశాంతినిస్తుందా స్థితి.' అని అంటాడు

మహాపరి నిర్వాణానికి ముందు గౌతమ బుద్ధుడు ' ఇంకా నాలుగు నెలలకంటే యెక్కువ బతకను చెప్పవలసిన దంతా చెప్పాను. యెక్కడా ఆచార్యముష్టిని పాటించలేదు కొంచెం చెప్పి కొంచెం చెప్పకుండా దాచిపెట్టలేదు'. ఆ తరువాత తన మహాపరి నిర్వాణానికి ముందు ఆనందునితో 'నాయనా ఆనందా! నీకు కొద్దిరోజులుగా చెప్తూవున్నదే మళ్లీ చెప్తుతూవున్నాను ఆందోళనపడవద్దు నాయనా! ఆనందా! నేనీరోజే చనిపోతున్నాను. యీ భూమిమీద నా చివరి రోజు ఇదే ' అని అంటాడు.

అలానే సోక్రటీస్ మృత్యువు మీద ఎంత నిబ్బరంగా ఉన్నాడంటే-

'నీవు చాలా సేపటి నుంచి ఏదో చెప్పాలనుకుంటున్నావు, ఏమిటిది'? అని సోక్రటీస్ క్రిటోను అడుగుతాడు.

క్రిటో 'నీకు విషం ఇవ్వవలసివున్న మనిషి నీకు ఒక సంగతి చెప్పమన్నాడు ఏమంటే, నీవు ఎంతతక్కువ మాట్లాడితే అంత మంచిదట మాట్లాడిన కొద్దీ వొళ్లు వేడి ఎక్కుతుంది. విషం పని చేయకుండా పోయే ప్రమాదం వున్నది ఒక్కోమారు రెండోడోసు కూడా ఇవ్వవలసి వస్తుందట! మూడోగ్లాసు తాగవలసి వచ్చినా ఆశ్చర్యం వుండదన్నాడు అతను ' అని చెప్పాడు నిదానంగా

అందుకు సోక్రటీసు 'అది అతని సమస్య; రెండుమార్లు కాకపోతే మూడుమార్లు యివ్వటానికి సన్నాహాలు చేసుకోనీ' అని అన్నాడు.

చివరగా సోక్రటీసు తన విచారణ సమయంలో ఏథెన్స్ పౌరులనుద్దేశించి 'స్నేహితులారా నిష్క్రమణ సమయం సమీపించింది. మన దారులు వేరవుతున్నాయి. నేను మరణించటానికి బయలుదేరబోతున్నాను మీరు జీవించాలని వెడుతున్నారు. ఈ రెంటిలోనూ ముందేదో ఆ పరమేశ్వరునికే ఎరుక,' అని అంటాడు

' ఆనందా! పూల ఋతువుకాదిది అయినా చూడు ఆనందా యీ రెండు సాలవృక్షాలూ పూలుపూసి ఆ పూవులను నాపై రాల్చుతున్నాయి ప్రకృతి ఇస్తున్న గౌరవం నాకిది. యింతకంటే యింకే గౌరవం కావాలి' అని గౌతమ బుద్ధుడు అంటాడు

ఇలా ఈ మహాతత్త్వవేత్త లిద్దరూ ఈ లోకం నుండి నిష్క్రమించారు.

కానీ వీరిద్దరూ తాత్త్వికజగత్తులో సూర్యచంద్రులు

## ఆధారగ్రంధాలు


| | | | |
|---|---|---|---|
| 1 | సోక్రటీసు అమరవాణి | - | పిలకా గణపతిశాస్త్రి |
| 2 | సిద్ధార్థుడు ఎందుకు పరివ్రాజకుడైనాడు | - | డా'' అంబేద్కర్<br>అనువాదం బి హెచ్. తిరుపతి |
| 3 | గ్రీక్ తత్త్వవేత్త సోక్రటీస్ జీవితం తాత్వికత | - | శ్రీ విరించి |
| 4. | గౌతమ బుద్ధుడు | - | జె. నటరాజ్ |


* * *

# ఉర్దూ గజేల్

– ఎస్. సదాశివ

గజేల్ ఒక రకమైన కవిత అందులో బేసి సంఖ్యలో కొన్ని చరణాలుంటాయి ఐదు కావచ్చు - తొమ్మిది కావచ్చు - పదకొండుకావచ్చు అన్ని చరణాలలో మాత్రల సంఖ్య సమానం మొదటి చరణాన్ని మత్లా అంటారు. చివరి చరణాన్ని మఖ్తా అంటారు. ఒక గజేల్‌లో ఎన్ని చరణాలున్నా ఏ చరణం భావం ఆ చరణానికే పరిమితం అంటే ప్రతి చరణం ఒక ముక్తకం మనం చరణమంటున్న దాన్ని గజేల్ పరిభాషలో షేర్ అంటారు ప్రతి షేర్ రెండు ముక్కల్లో విరిగిపోతుంది ప్రతి ముక్కను మిస్రా అంటారు. ఇలా రెండు ముక్కల్లో విరిగిపోయే పద్య చరణాన్ని తెలుగులో ద్విపద అంటాము. హిందీలో దోహా అంటారు ఉర్దూలో షేర్ అంటారు. ద్విపదకు ప్రాస నియమం దోహాకు అంత్యప్రాసనియమం. షేర్‌కు ఖాఫియా రదీఫుల నియమం రదీఫంటే చివరి పదం - ఖాఫియాఅంటే రదీఫుకు ముందుండే పదం - పదం కాకపోతే అక్షరం

''పన్నిన చీకటి బాపంగ నొక్క-
సన్నని దీపంబు చాలదే తలప''

ఇది తెలుగు ద్విపద ద్విరుక్త నకారం ప్రాస

''తులసీ! మీఠే వచన్ సే - సుఖ్ ఉపజత్ చహువోర్
వశీకరణ్ యహ్ మంత్ర్‌హై - త్యజియే వచన్ కఠోర్''

ఇది హిందీ దోహా - ఓర్, కఠోర్ అనేవి అంత్యప్రాసలు

''గజేల్ ఉస్నే ఛేడీ - ముఝే సాజ్ దేనా
జరా ఉమ్రె - రస్తాకు - ఆవాజ్ దేనా''

ఇది ఉర్దూగజేల్‌షేర్ - ఇందులో సాజ్, ఆవాజ్ అనేవి ఖాఫియాలు దేనా అనేది రదీఫ్ అంత్యప్రాసలాగా ఖాఫియాలో ఉచ్చారణ సామ్యముంటే చాలు రదీఫ్ మాత్రం అన్నిషేర్లకు అదేవుంటుంది.

గజేల్‌లో మత్లా వరకే రెండు మిస్రాలకు ఖాఫియారదీఫుల నియమం. తర్వాతి షేర్లలో రెండవ మిస్రాకు మాత్రమే ఈ నియమం.

ఇదింకా స్పష్టం కావటానికి ఒక మత్లాను, రెండు షేర్లను ఉదాహరిస్తాను

'' ఆహ్ కో చాహియే ఇక్ ఉమ్ర్ అసర్ హోనే తక్
కోన్ జీతాహైతెరే జుల్ఫ్‌కె సర్ హోనే తక్
ఆషికీ సబ్ర్ తలబ్ ఔర్ తమన్నా బేతాబ్
దిల్ క క్యారంగ్ కరుఁ ఖూనె - జిగర్ హోనే తక్
హమ్‌నె మానాకె తగాఫుల్ న కరోగే లేకిన్
ఖాల్ హోజాయెంగె హమ్ తుమ్‌కొ ఖబర్ హోనే తక్''

మొదటి చరణం మత్లా - రెండు మిస్రాలకు 'అసర్', 'సర్' అనే ఖాఫియాలు, హోనే తక్ అనే రదీఫ్ ఉన్నాయి రెండవ షేర్‌లో మొదటి మిస్రాకు ఈ నియమంలేదు రెండవ మిస్రాకు 'జిగర్' అనే ఖాఫియా, 'హోనేతక్' అనే రదీఫ్ ఉన్నాయి. మూడవషేర్‌లో మొదటి మిస్రాకేవీ లేవు రెండవ మిస్రాకు ఖబర్ అనే ఖాఫియా, 'హోనే తక్' అనే రదీఫ్ వున్నాయి

మఖ్తా అన్ని షేర్లలాగే వుంటుంది కాని అందులో కవి తన కలం పేరు తెల్పుకుంటారు. కలంపేరును తఖల్లుస్ అంటారు కవులందరికి ఏదో వొక తఖల్లుస్ వుంటుంది మీర్జాగాలిబుకు రెండు తఖల్లుస్‌లు ఒకటి గాలిబ్ ఇంకొకటి అసద్

ఇంతటితో గజేల్ ఛందస్స్వరూపాన్ని చెప్పినట్లే ఇంకొక రెండు మాటలు చెప్పటం అవసరమనుకుంటున్నాను

గజేల్ భావానికి ఏకసూత్రత వుండదన్నాను ఏ షేర్ భావ మాషేర్‌కే పరిమితమన్నాను కాని కొన్ని సందర్భాల్లో ఒకషేర్ భావాన్ని ఇంకా విశదీకరించటానికి గాను ఇంకోషేర్ వరకు సాగదీస్తాడు కవి ఇలా సాధారణంగా జరుగదు తప్పని సరి పరిస్థితుల్లోనే జరుగుతుంది అలా ఒకే భావం రెండు మూడు షేర్లవరకు సాగినట్లయితే దాన్ని 'ఖితాబంద్' అంటారు

గజేల్‌కు ఖాఫియా ప్రాణం రదీఫ్ అదనపు అందం కొన్ని గజళ్లకు రదీఫుండదు కొన్నిటికి మాత్రమే

''నైగులే నగ్మ హూఁ న పర్దయె సాజ్
మై హూఁ అప్నీ షిక్స్తే కీ ఆవాజ్ ॥ మత్లా

తూ ఔర్ ఆరాయిషే ఖమే కాకుల్
మై ఔర్ అందేష హాయె దూర్ దరాజ్ ॥ షేర్

హూఁ గిరఫ్తారె ఉల్ఫతే - సయ్యాద్
వర్న బాఖీహై తాఖతే పర్వాజ్ ॥ షేర్

ఇవికూడా మిర్జాగాలిబ్ షేర్లే మత్లాలో, 'సాజ్', 'ఆవాజ్' ఖాఫియాలు రదీఫ్‌లేదు రెండవ, మూడవ షేర్లలో 'దరాజ్', 'పర్వాజ్' ఖాఫియాలు - రదీఫ్‌లేదు

- - -

గజేల్ అనే పదానికి ప్రేయసితో జరిపే రహస్య సంభాషణమని అర్థం ఈ సంభాషణ గుంభనంగా, నర్మ గర్భితంగా, ధ్వని ప్రధానంగా, వ్యంగ్య మర్యాదతో సాగుతుంది కాని ఎక్కడా వాచ్యం కాదు. ప్రేయసీ ప్రియుల ప్రణయ భాషణం అన్యులకు తెలియగూడదు తెలిస్తే బద్నామీ గదా! బద్నామీని రుస్వాయీ అంటారు రుస్వాయీ కంటే మరణమే మేలు ప్రణయ గోపనంలో ప్రాణం పోయినా పరవాలేదు.

గజేల్ కవిత భగ్న ప్రేమికుని గాధ అనంతంగా సాగుతున్న గాధయిది గజేల్ కవి భగ్న ప్రేమికుని ప్రతినిధి అతని భావాలు అతని అనుభవాలే కావచ్చు అన్యుల అనుభవాలే కావచ్చు అతని ఊహలే కావచ్చు తన అనుభవాలను అందరి అనుభవాలుగా, అందరి అనుభవాలను తన అనుభవాలుగా చెప్పటమే గజేల్ చెప్పటం. దీన్నే ఆప్ బీతీ ని జగ్‌బీతీ గా జగ్‌బీతీని ఆప్‌బీతీ గా చెప్పట మంటారు ఆప్‌బీతీ అంటే తనకు జరిగింది జగ్‌బీతీ అంటే లోకానికి జరిగింది ''సారే

జహాఁ క దర్ద్ హమారే జిగర్ మెహై''. అంటాడు గజేల్ కవి అంటే '' ప్రపంచ మంతటి వేదన నాగుండెలోనే గూడుకట్టుకొని వున్నది'' అని.

గజేల్ సౌందర్యానికి పర్యాయపదం. ప్రేమను, అందలి తీయని బాధను సుందరంగా చెప్పితేనే దాన్ని గజేలంటారు. సుందరమైన ఒక మాటయినా గజేలే.

ఇన్ మస్త్ అంఖ్డియోంకొ కఁవల్ కహగయాహుఁమై
మహసూస్ కర్ రహాహుఁ గజేల్ కహగయాహుఁమై

అంటాడు అబ్దుల్‌హమీద్ అదమ్. ఇది మత్లా కనుక రెండు మిస్రాల్లోని కఁవల్, గజేల్ అనేవి ఖాఫియాలు. తరువాతిది రదీఫ్

''మదాలసాలయిన ఈ నేత్రాలను కమలాలన్నాను.
అలా అని గజేల్ అన్నానని భావిస్తున్నాను.'' అని తాత్పర్యం.

గజేల్ వింటుంటే కదల లేని ముసలి వాళ్లలో సైతం ఉత్సాహం ఉరకలు వేస్తుందట. సఫీ లఖ్నవీ అనే మహాకవి ఇలా అంటాడు;

''గజేల్ ఉస్నె ఛేడీ ముఝె సాజ్ దేనా
జరా, ఉమ్రె - రఫ్తాకొ ఆవాజ్ దేనా''

ఇదీ మత్లానే. సాజ్, ఆవాజ్ అనేవి ఖాఫియాలు, దేనా రదీఫ్

'' ఆమె గజేల్ ప్రారంభించింది. నా కేదయినా వాద్య మియ్యండి

గడచిపోయిన యవ్వనాన్ని కాస్త వెనుకకు పిలవండి.'' అని భావం.

గజేల్‌కవి సౌందర్యారాధకుడు సౌందర్యం భగవద్విభూతి. అతని ప్రేయసి మానవ కాంత కావచ్చు. అతని ప్రేమ ఐహికమయింది కావచ్చు. అతని ప్రేయసి పరమాత్మ కావచ్చు. అతని ప్రేమ భగవత్ప్రేమ కావచ్చు రెండు విధాలా అన్వయించుకునే అవకాశం వున్నది అతని వర్ణన, అతని శబ్దప్రయోగం అలాగా వుంటాయి. అదంతా తీరికగా చర్చించుకోవలసిన గంభీర విషయం. గజేల్ ఒక కల్చర్‌కు ప్రతిరూపం. ఆ కల్చర్‌లో పెరిగిన వాళ్లు, లేదా ఆ కల్చర్‌తో బాగా పరిచయం వున్న వాళ్లు మాత్రమే గజేల్ మాటలను గ్రహించగలరు. కవి సౌందర్యారాధకుడు - కనుక గజేల్ ప్రణయ శృంగారాల కవిత. అయితే అసభ్యతను, అశ్లీలతను ధ్వనించే శబ్దమేదీ గజేల్‌లో ఇముడదు. ఇది గజేల్ కల్చర్. ఇక్కడ రెండు ముచ్చట్లు వినండి

పడుపు వృత్తిని అవలంబించిన వేశ్యలు అసభ్యమైన ఆటపాటలతో విటులను రంజింపజేస్తారు అది వాళ్ల బ్రతుకుదెరువు. అసభ్యత వాళ్ల హావభావాల్లోనే కాని వాళ్లు చదివే కవితలో కాదనే అంశాన్ని గమనించాలె శాస్త్రీయ నృత్యగానాలతో తమ కోఠా మీద రసికులను రంజింప జేసే వాళ్లను తవాయపులంటారు. వాళ్ళు పడుపు వృత్తి చేయరు. వాళ్ల మహఫిల్ రాత్రి పన్నెండు గంటలకే సమాప్తమవుతుంది వాళ్లలో కొందరు మనసు పడిన ఎవరో ఒక సంపన్నునికి ఆశ్రితలుగా

వుండే వాళ్లు. (రంగాజమ్మను స్మరించుకుందామా?) అలాటి కోఠాలు నిర్వహించే వృద్ధ కళావతిని చౌధరాయిన్ అనే వాళ్లు చౌధరాయిన్ సమస్త కళల్లో పరిశ్రమ చేసి వుంటుంది. లఖ్నోలో ఒక కోఠా నిర్వహించే చౌధరాయిన్ సామాన్య అయినా అసామాన్య. రాజులు, నవాబులు, రయీసులు ఆమెను గౌరవించేవాళ్లు. సర్ తేజ్ బహాదుర్ సప్రూ, పండిత్ మోతీలాల్ నెహ్రూలు కూడ ఆమెను ఆదరించే వాళ్లు. ఆమె కోఠా క్రింద ఒక పుస్తకాలషాపుండేది ఆషాపు యజమాని ఖ్వాజ్ అబ్దుల్ రవూఫ్ ఇష్రత్ అనేకవి. ఇష్రత్ అతని కలంపేరు. అప్పుడప్పుడు అసర్‌లఖ్నవీ, రియాజ్ ఖైరాబాదీల వంటి మహాకవులు ఆషాపులో కూర్చుండి గంటల తరబడి కావ్యగోష్ఠి జరిపే వాళ్లు. తన కోఠా పిట్ట గోడ నానుకొని, నిలబడి చౌధరాయిన్ వాళ్ల కావ్యగోష్ఠిని వింటూ ఆనందించేది.

ఒక నాడొక షేర్ ప్రసక్తి వచ్చింది అది ఇష్రత్ షేరయి వుంటుంది

''మిలే జోహస్రమె నాసెహ్! జుబాతేరీ లేలూం
అజీబ్ చీజ్ హైయే తూలె ముద్దవా కెలియే ''

( ఇక్కడ దీని తాత్పర్యం అనవసరం. అదొక పెద్ద కథ. ప్రస్తుతం శబ్ద ప్రయోగాన్ని గురించే మాట్లాడుకుందాం)

పైషేర్‌లో భావం బాగానే వున్నది బందిష్ బాగానే వున్నది. కనుక అక్కడికవులు 'వాహ్వా, వాహ్వా' అని ప్రశంసించినారు

ఇదంతా పైనుంచి చూస్తున్న చౌధరాయిన్, ''ఇష్రత్‌సాహెబ్! మధ్యలో కలుగజేసుకుంటు-ందుకుమన్నించండి. ఆషేర్‌నుఇలాచదివితే ఇంకా బాగుంటుందనుకుంటాను,

మిలే జో హస్రమె నాసెహ్! తెరీజుబాం లేలూం
అజ్‌బ్ చీజ్ హైయే తూలె - ముద్దవాకె లియే-''

అని సూచించింది. అక్కడి మహాకవులు ఆశ్చర్యానందాలతో ఆమె ఔచిత్యాన్ని ప్రశంసించినారు. ఏమి చేసిందామె? 'జుబాం తేరీ' అనే బదులు 'తేరీ జుబాం' అని మార్పు చేసింది జుబాం తేరీ అని చదివేటప్పుడు 'తేరీ' అని క్షణం ఆగిపోతే ఆపైన ఏలాటి అశ్లీలార్థక శబ్దం వస్తుందో అనే శంక కలుగుతుంది కొంటెవాళ్లు కొందరలా చేస్తారు గూడా. తేరీజుబాం అనటం వలన ఆ శంకకు ఆస్కారం లేదు. ఇష్రత్ చదివిన షేర్‌లో ధ్వనించే స్వల్పమైన అశ్లీలతను అంతటి మహాకవులు గుర్తించ లేకపోయినారు. కోఠా నడిపే ఒక తవాయఫ్ గుర్తించి సవరించింది. అశ్లీలార్థం వచ్చేట్లు శబ్దాన్ని విరిచి చదివే కొంటెవాళ్లుంటారు కొన్నాళ్ల క్రిందట రాయప్రోలు వారి ''పొగడరా నీ తల్లి భూమి భారతిని'' అనే పంక్తిలో కొందరు కొంటెవాళ్లు ''పొగడరా నీ తల్లి'' అని కాకువు ద్వారా అశ్లీలార్థాన్ని ధ్వనింపజేసి ఆగిపోయేవాళ్లు.

\- - -

జహాంగీర్ చక్రవర్తి సౌందర్యారాధకుడే కాక సాహిత్య మర్మజ్ఞుడు. కళా విదుడు తన ఆత్మ కధను 'తూజుకె- జహాంగీరీ' అనేపేరఫారసీలో రాసుకున్నాడు ( బాబర్‌కూడా 'తూజుకె- బాబరీ' అనే ఆత్మకధ రాసుకున్నాడు కాని అది తుర్కీ భాషలోవున్నది )

జహాంగీర్ తన ఆత్మకథలో చెప్పుకున్న ముచ్చటనే నా భాషలో నా శైలిలో చెప్తున్నానిక్కడ.

జహాంగీర్ సమక్షాన, సభలో, కమ్మని కంఠంతో కమనీయమైన ఒక గజల్‌ను గానం

చేస్తున్నాడొక గాయకుడు. ప్రతి షేర్‌ను పరవశించి వింటున్నారు చక్రవర్తి. ఒకషేర్ సభలో కలకలం రేపింది.

''నిద్రాలసాలయిన నీ నయనాలు తెల్లవార్లూ నీ ప్రియునితో జరిపిన శృంగార చేష్టలను చెప్పక చెప్పుతున్నవి.'' అని ఆషేర్‌లోని భావం. చక్రవర్తి సన్నిధిలో చదువ దగిన షేర్ కాదది చక్రవర్తి కళ్లలో కెంపులు మెరసినవి. బొమ్మలు ముడి వడ్డాయి. ముఖం జేవురించింది. నడుముకు బిగించిన పిడి కత్తి మీద పడింది చక్రవర్తి చేయి. గాయకునికి ఆయువు మూడినట్లే. కవి పాపానికి గాయకుడు బలికాబోతున్నాడు. సభలోని వాళ్లంతా చేష్టలుడిగి చిత్తరువులలాగా నిల్చుండి పోయినారు. ఒక వృద్ధ మంత్రి సాహసించి, ''జహాపనా! అభయ ప్రదానం చేస్తే ఒక మాట విన్నవించుకుంటాను.'' అన్నాడు. అనుమతి లభించింది. ఆ మంత్రి యిలా విన్నవించినాడు;

''సాహెబె ఆలం! దేవర వారు చిత్తగిస్తున్న గజేల్ మరెవరిదో కాదు. హజ్రత్ అమీర్ ఖుస్రూది. ఆ మహాకవి తెల్లవార్లూ హజ్రత్ నిజాముద్దీన్ ఔల్యా సన్నిధిలో గడిపేడన్న సంగతి జగద్విదితమే. అతని ఆధ్యాత్మికసాధన ఔల్యా సన్నిధిలోనే జరిగేది. హజ్రత్ నిజాముద్దీన్‌కు భగవంతుని పట్ల గల ప్రేమ యేపాటిదో అదీ జగద్విదితమే మహబూబె- ఇలాహీ అనేవాళ్లతన్ని ఆమహనీయుడు రాత్రంతా భగవన్నామస్మరణ, మనన, ధ్యానాలతోనేగడిపే వాడు నిద్రించేవాడు కాదు. లోకం నిద్రలో కూరుకపోయినప్పుడు యోగి మెలకువగా వుంటాడు నిద్రాలసాలయిన నయనాలు ఔల్యావి. శృంగారచేష్టితాలు స్మరణధ్యానమననాలు ఇది ఐహికశృంగార వర్ణనకాదు.''

ఈ వివరణ వినగానే చక్రవర్తి కనురెప్పలు ఆనందాశ్రువులతో తడిసినవి బొమముడి విడిపోయింది జేవురించిన ముఖ మండలం శీతల చంద్రికలు వెదజల్లింది కత్తి పిడిమీదిచేయి కంఠహారం మీదికి వెళ్లింది అమూల్యమైన ఆణిముత్యాలహారం గాయకుని గళసీమ నలంకరించింది

ఫారసీ ఉర్దూ గజేళ్లలో ఆమాత్రం శృంగారమే పచ్చి శృంగారంగా భావించబడుతుంది. విజయ రాఘవ నాయకుడు తన శృంగార లీలలను భక్త శిఖామణి క్షేత్రయ్యచే పచ్చిపచ్చిగా రాయించుకొని మీసాలు మెలివేసినాడంటారు.

గజేల్ ''అల్పాక్షరముల ననల్పార్థ రచన'' ఈ మాటన్న పాల్కురికి సోమనాథుడు తానే పాటించలేదు కాని గజేల్ కవి పాటించక తప్పదు. తాను చెప్పదలచుకున్న భావాన్ని ఖాఫియా రదీఫులను పాటిస్తూ సమగ్రంగా చెప్పవలసి వుంటుంది అస్పష్టత, అన్వయక్లిష్టత వుండగూడదు. చదువగానే భావం స్ఫురించాలె భావాన్ని మించని భాష గజేల్‌కు అవసరం మిర్జాగాలిబును మినహాయిస్తే ఉర్దూ కవులెవ్వరూ భావాన్ని మించిన భాషను ప్రయోగించలేదు సంక్షిప్త రచన కనుక వ్యర్థపదాలకు, దీర్ఘ దీర్ఘ సమాసాలకు చోటు మిగులదు. గజేల్‌శరీరం అతి సున్నితమయింది బరువైన పదాలు, శ్రుతి కటువైన అక్షరాలు శోభించ వందులో

మిర్జా గాలి బంతటి మహాకవి చెప్పిన,

''జహర్ మిల్తాహి నహీ ముఝకొ సితంగర్! వర్నా
క్యాఖసం హై తెరే మిల్నే కి కె ఖాభి న సకూ౦''

షేర్ యొక్క పటువైన బందిష్ను, భావాన్ని ప్రశంసించిన వాళ్లే రెండవ మిస్రాలో ఒకే చోట చేరిన మూడు కకారాలు (కి.కె.ఖా) చెవులకు కటువుగా వున్నాయని విమర్శిస్తారు.

ఇంకొకషేర్‌లో ''భూంపాస్'' అని ప్రయోగించి నాడు గాలిబ్ భూం అంటే కనుబొమ. 'కనుబొమ్మలదగ్గర' అని అతని భావం గాలిబును ఆరాధించే మహాకవి హస్రత్ మోహానీ, ''అందమైన షేర్ భూం అనే కటువైన అక్షరం వలన అందవిహీనమైంది '' అని బాధపడ్డాడు. భూం బదులు అదే అర్థాన్నిచ్చే 'అబ్రూ' అనే పదం వాడవచ్చు. కాని ఒక మాత్ర అధిక మవుతుంది.

ఉర్దూ కవి ప్రియ అతిలోక సుందరి. ఆమెను ప్రేమించి ఆరాధించే వాళ్లనేకులు. వాళ్లంతా ఒకరి కొకరు రఖీబులు (శత్రువులు) ఎంతటి సౌందర్యం, ఎంతటి లాలిత్యం, ఎంతటి సౌకుమార్యం వున్నా ఆమె కనికరం లేని కఠిన హృదయ ఆమె పాషాణమే. కనుక కవులామెను సనమ్ అంటారు బుత్ అంటారు. సనమ్ అన్నా బుత్ అన్నా శిలావిగ్రహమే ఆమె నివాసాన్ని సనమ్ కదా, బుత్ కదా అంటారు. అంటే మందిరం. మందిరంలో విగ్రహారాధన ఇస్లాం మతం ప్రకారం నిషిద్ధం. ప్రేమోన్మత్తుడైన కవి విధి నిషేధాలను పాటించడు. మతం నిషేధించిన మద్య పానం కూడా అతనికి ప్రియమయింది. ఉర్దూ గజల్లలో మద్యపాన ప్రసక్తి విశేషంగా వుంటుంది. మద్య పానం పారవశ్యానికి ప్రతీక. ఉపదేశకుడు మద్య పానం పాపమని, పాపం చేసే వాళ్లు నరకానికి వెళ్తారని భయపెడతాడు పుణ్యాత్ములు స్వర్గానికి వెళ్తారని ప్రలోభపెడతాడు ఉపదేశకుణ్ణి షేఖ్, వాయెజ్, జాహెద్, నాసెహ్ అంటారు అడుగడుగునా అతన్ని అవహేళన చేస్తారు కవులు.

''యె మై కదాహై, తెరా మదర్సా నహీ వాయెజ్!
యహాం షరాబ్‌సె ఇన్సాం బనాయె జాతేహైం''

అంటాడొక కవి. '' ఓ ఉపదేశకుడా! ఇది పానశాల. నీ పాఠశాల కాదు ఇక్కడ మద్యంతో మనుషులు తయారు చేయబడతారు '' కవి చెప్పని భావమేమంటే ''నీ పాఠశాలలో మానవతలేని మత మౌఢ్యం గల వాళ్లు తయారవుతారు'' - అది మన ఊహకు వదిలినాడు.

ఉర్దూకవి తన ప్రేయసిని సనమ్, బుత్, దోస్త్, మహబూబ్ అని సంబోధిస్తారు. మద్యం అందించేటప్పుడామె సాఖీ.

ఈ ప్రేమలో సంయోగంలేదు. వియోగమే బ్రతికినన్నినాళ్లు ఆమె తలంపులతో ఉన్మాదస్థితిలో బ్రతుకటమే. చివరికి మరణం అదే సంయోగం (విసాల్)

సౌందర్యోపాసన - ఆత్మ విలోపనం ఈ రెంటికీ అనువైన ప్రతీకలు,

గుల్ (గులాబి) బుల్బుల్, చమన్ (తోట), ఆషియాం (గూడు) సయ్యాద్ (వేటకాడు) ఖఫస్ (పంజరం) బహార్ (వసంతం) ఖిజాం (శిశిరం) షమా (మైనపుదీపం) పర్వానా (మిడుత) దైర్ (మందిరం) హరం (మసీదు) మై (మద్యం) మై కదా (పానశాల) మీనా (మధుకలశం) జామ్ (పానపాత్ర)

ఈ మాటలకు పర్యాయపదాలు చాల వున్నాయి

ఇదంతా గజల్ కవుల ముడిసరుకు. దీనితో ఎందరు మహాకవులు, ఎన్నెన్ని గజల్లు చెప్పినారో ఆ వైన మంతా మరో వ్యాసంలో-

* * *

# ఫిడేలు రాగాల డజన్ పట్టి రూప విప్లవమేనా?

- హెచ్చార్కె

(గత ఆగస్టు మిసిమి సంచికలో శ్రీ బి. తిరుపతిరావు గారు రాసిన ''మార్క్సిజ్ కళాత్మక కోణాన్ని'' చదివిన తరువాత శ్రీ హెచ్చార్కె రాసిన వ్యాసమిది - సంపాదకుడు.)

తన సమీప గతంలోని కవిత్వం (భావ కవిత్వం) మీద - కళ్లు మిరిమిట్లుగొలిపే ధిక్కారం ఫిడేలు రాగాల డజన్. ద్విత్వాక్షరాల్ని విడదీయడం వంటి చమత్కారాలే అయితే, ఆ పుస్తకాన్ని ఎప్పుడో మంచిపోయి ఉండేవాళ్లం. తన కాలపు జీవనాడి 'ఫిడేలు రాగాల డజన్'. తెలుగు భాషకు సంబంధించినంత వరకు ఆధునిక జీవితానికి తొలి కవితా వ్యక్తీకరణం 'ఫిడేలు రాగాల డజన్'. ఈ అర్థంలో - అది కన్యాశుల్కం తరువాత - మళ్లా అంతటి రచన. నిజానికి కన్యాశుల్కానికి, ఫిడేలు రాగాల డజన్‌కు వస్తు, రూపాలలో సన్నిహిత సంబంధం ఉందని నా అభిప్రాయం. అలాంటి మాస్టర్ పీస్‌ని కేవలం 'రూపశ్రద్ధా విప్లవా' నికి పరిమితం చేయడం సాహిత్యపరంగా నేరం.

'ఫిడేలు రాగాల డజన్'ని తెలుగు కవితలో ఒక పతాకంగా నిలబెట్టేది దానిలోని వస్తు నిర్దిష్టతే. ఈ విస్పష్ట నిర్దిష్టత తన సమీపగతం (భావకవిత్వం) లోని పరమ అనిర్దిష్టత మీద తిరుగుబాటు కూడా. పఠాభి డెబ్బయ్యోలో పడి ప్రవేశించినప్పుడు జరిగిన అభినందన సందర్భంగా ' ఉదయం' పత్రికకు ఇంటర్వ్యూ ఇస్తూ ఆయన, ఈ సంగతే స్పష్టంగా చెప్పారని భావిస్తున్నాను ''సంగీతానికి ఇస్యూస్ అవసరం లేదు, పేచీపడాల్సిన ఇస్యూస్ లేకుండా కవిత్వం లేదు'' - అని పఠాభి అన్నారు. ఆయన అన్నారనీ అనలేదనీ కాదు. 'ఫిడేలు రాగాల డజన్' తనకు తాను సాక్ష్యంగా ఉంది

అంత వరకు 'కొత్త' కవిత్వం - భావకవిత్వం - పరమ అనిర్దిష్టంగా సాగింది కృష్ణశాస్త్రి ప్రేయసి స్థలకాలాల్లేని అనిర్దిష్ట. అసలామె మనిషి కూడా కాదేమో. 'మింట మెంసెడి చుక్క' ఏమో. పఠాభి గారి కామాక్షి రక్తమాంసాలున్న - స్థల కాలాలున్న - మనిషి నిర్దిష్టంగా ఆధునిక యువతి. కృష్ణశాస్త్రి ప్రేయసిని వదిలేసి ప్రేమను- ఆబ్‌స్ట్రాక్ట్ ప్రేమను - ఉగ్గడించాడు పఠాభి ప్రేమ గురించి అతి ఊహలు చేయకుండా ప్రేయసిని ఉగ్గడించాడు. ఒక్క ప్రేమ విషయమే కాదు కొత్తగా తెలుగువాడి అనుభవం లోనికి వచ్చిన నగరజీవితాన్ని పఠాభి త్రీడైమెన్షనల్ బొమ్మలతో మన ముందుంచాడు ''చయినా బజారు గగనంలో అనవసరంగా అఘోరంగా తగిలింపబడియున్న జాబిలి'' - తిరుపతిరావుకు అకవిత్వం కావచ్చు నాకది కవిత్వమే. గొప్ప కవిత్వమే. ఎందుకంటే ఈ మాటల బొమ్మ - నేను నిత్యం చూస్తూ చూడని నగరజీవితపు అసంబద్ధతని, పేలవత్వాన్ని, దాని పై నాకున్న 'కసి' ని - ఒక సూత్రంగా కాకుండా, ఫీలింగ్‌గా- తిరిగి నాకు అందించింది కవిత్వం చదవుతున్నప్పుడు నా గుండె నాల్కసాచి నాతో మాట్లాడుతున్నట్లుటుంది. నగర జీవితం దానిలోని అసంబద్ధత 'ఫిడేలురాగాల డజన్'లోని ఇస్యూ, వస్తువు. పఠాభి వస్తువుకు - పెద్దదో, చిన్నదో- పీట మాత్రం వేశాడు. పఠాభి కవిత 'ముడ్డి లేని ముంత' కాదు.

''కొన్ని చారిత్రక సందర్భాలలో సాహిత్యంలో వస్తువు కంటే రూపానికి అధిక ప్రాధాన్యం యివ్వాల్సి వస్తుంది,'' అని తిరుపతిరావు అన్నారు. సరిగ్గానే అన్నారు. 'యివ్వాల్సి వస్తుంది' అనడం కన్న' ఇవ్వాల్సి ఉంటుంది' అనడం మరింత సబబు. సంఘం యొక్క రాసే చెయ్యి కవి. రూపం కన్న వస్తువుకు అధిక ప్రాధాన్యం ఉండే చారిత్రకసందర్భాలుంటాయని కూడా తిరుపతిరావు ఈ వాక్యం ద్వారా అంగీకరించారు. 1970-80 అటువంటి చారిత్రక సందర్భాలలో ఒకటి. ఈ

సం ం 1980 తరువాత విస్తరించింది. ఎట్లా జీవిస్తామని కాదు, ఎట్లాగయినా జీవించాలన్న తెగింపు 70 దశకాన్ని క్యారెక్టరయిజ్ చేస్తుంది. అది ఒక పెను సంక్షోభం. ఎమర్జెన్సీ ఊరికే వచ్చిపోలేదు. ఈ సంగతి తెలిసీ ఏమీ తెలీనట్లు దాటవేయడాన్ని ఎలా అర్థం చేసుకోవాలి.

గురజాడ కవిత్వంలో, నాటకంలో వస్తువుకు పెద్దపీట వేశారు. 'దేశమంటే మట్టికాదోయ్' వంటి ''అతి నిర్దిష్ట'' కవిత్వం రాశారు అవి తెలుగునాట ప్రజాస్వామ్యపు తొలిరేకులు. దరిమిలా జీవితంలో కొంత వెసులుబాటు వచ్చింది. కొంచెం 'సుఖం' వచ్చింది కాని, ఇది 'కొంచెం' సుఖమ్. భ్రమాన్విత తృప్తి. ఈ నేపథ్యంలో భావకవిత్వం (కవిత్వంలో అనిర్దిష్టత) హృద్యంగానే ఉంది కాని అది భ్రమ కాబట్టి, దాన్నీ ధిక్కరించడం తప్పనిసరి అయ్యింది. కవిత్వంలో దాన్ని మొదట పట్టుకున్న భావుకుడు పఠాభి 1970 దశకంలో దేశవ్యాప్తంగా జీవితం కల్లోలితమయింది. గడ్డి పోచ దొరికినా దాన్ని బ్రహ్మాస్త్రంగా ప్రయోగించాలన్న తపన వ్యక్తమయింది తిరిగి 80లో మళ్లీ ఒక భ్రమాన్వితమైన ఊపు, సుఖభ్రమ, జీవితంలో ప్రవేశించాయి. ఎనభయ్యవ దశకం' లో

**''డెబ్భై అయిదు తరువాత విప్లవ కవిత్వంలో వస్తు రూపాల సమన్వయం పోయి వస్తువుకి పెద్దపీట వెయ్యడంతో కవిత్వం అకవిత్వమయిపోయినప్పుడు, ఎనభయ్యో దశకంలో రూపం మీద శ్రద్ధతో వచ్చిన కవిత్వంలో విప్లవాంశ అని వార్యంగా ఉంది.''**

*- ఆగస్టు 'మిసిమి'లో బి. తిరుపతిరావు*

పుట్టిపెరిగిన కవులు - ఫ్రెష్‌గా ఉండడం వల్ల - సుఖాన్నే చూశారు, సుఖంలోని మొనాటనీని కూడా చూశారు. మరింత సుఖం' కోరుకున్నారు. అంతకు మించి చూడ లేకపోయారు. '70ల నుంచి కొనసాగుతున్నవారు - అప్పటికే దెబ్బతిని ఉన్నారు గనుక - ఈ భ్రమను పక్కన పెట్టగలిగారు. పోగా, జాతి జనులు చేసిన ఒక ప్రయత్నంలోని వైఫల్యాన్నీ అవాహన చేసుకున్నారు. స్త్రీలుగా, దళితులుగా ఆ రెండు కాని దిగువ మధ్యతరగతి మనుషులుగా నిర్దిష్ట జీవితం లోంచి కవిత్వం కావడం మానుకోలేదు.

నిర్దిష్ట జీవితాన్ని పట్టించుకోవడం అన్నదే 'ఫిడేలు రాగాల డజన్'కు ప్రాణం. అదే తిరిగి దిగంబర కవిత్వానికీ, నక్సల్బరి తరానికీ ప్రాణం. దిగంబర కవితను మొదట నిర్ద్వంద్వంగా కావిలించుకున్నదీ, దరిమిలా ఆ మార్గాన్ని శుభ్రం చేసుకుని అదే మార్గంలో సాగిపోయిందీ నక్సల్బరి తరమేనని బహుధా వివరించనవసరం లేదు పఠాభి దేన్ని ధిక్కరించాడో ఆ అనిర్దిష్ట (భావ) కవిత్వాన్ని - కొద్ది వ్యత్యాసాలతో - పునరుద్ధరించడానికి జరిగిన వ్యర్థ ప్రయత్నమే ' ఎనభయ్యవ దశకపు- 'శుద్ధ కవిత' ఇలా చెప్పడమంటే భావకవిత్వాన్ని తక్కువ చేయడం కాదు. '80 తరం రాతలు అకవిత్వమని అనడమూ కాదు. నిర్దిష్టమైనా, అనిర్దిష్టమైనా వస్తువు లేకుండా కవిత్వం లేదు. ఇస్యూలేకుండా కవిత్వం లేదు ఇస్యూను - వస్తువును - పట్టించుకున్న మేరకు '80 దశకం' కవులు చక్కని కవిత్వం రాశారు కూడా. పేచీ పడదలిస్తే 'వస్తువు'తో పేచీపడాలి, 'రూపం'తో కాదు. నిజానికి అకవిత్వం అనేది తిట్టుమాత్రమే. అది ఏ అర్థాన్నీ బట్వాడా చేయలేని అసమర్థ పదం. అదొక సాహిత్య విమర్శక పారిభాషిక పదమే కాదు నక్సల్బరి తరం కవిత నినాద ప్రాయమనడం కూడా ఒక తిట్టు మాత్రమే. ఇది మనిషిని పట్టుకుని 'నువ్వు మనిషివికావు...' అనడం వంటిది. విమర్శించండి, తిట్టకండి తిట్టు కవిత్వం అవుతుందేమోగాని, సాహిత్య విమర్శ మాత్రం కాదు.

# కాలం ముందుకొచ్చింది

– రెడ్డి వెంకట సత్యనారాయణ

మానవ జీవితం నిత్యం మారుతూ ఉంటుంది. మనం పుడతాం, పెరుగుతాం. గిడతాం అంతేకాదు, మన చుట్టూ ప్రపంచం గూడ క్షణ క్షణం మారుతూ ఉంటుంది ఈమారే ప్రపంచానికి అనుగుణంగా గూడ మనం మారుతూ ఉంటాం. ప్రపంచం గబగబ పరుగిడుతుంటే, దానితో పాటు మనం పరుగెత్తలేకపోతే, అంటే మనం తదనుగుణంగా మారలేకపోతే, పర్యవసానం ఏమిటి? ఈనాటి సమాజ శాస్త్రవేత్తలను వేధిస్తున్న ప్రశ్న ఇదే

గతంలో ప్రపంచం ఇంత వేగంగా మారలేదు. ఇంగ్లండ్‌లో 1714లో పేటెంట్ చేయబడిన టైపు రైటరు వాడకంలోకి రావడానికి 150 ఏళ్ళుపట్టింది అదే ఈనాడైతే? శాస్త్రవేత్త ఒక నూతన ఆవిష్కారాన్ని చేసీ చేయక ముందే అది మార్కెట్టులోకి వస్తోంది.

అలాగే సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాలలో మార్పులు శరపరం పరగ శరవేగంతో వస్తున్నాయి. ఈనాటి మన రాజకీయ రంగంలో ఎవరు ఎప్పుడు ఏ పార్టీలో ఉంటారో, ఏ సిద్ధాంతానికి కట్టుపడి ఉంటారో తెలియదు గంటకొకపార్టీ, గంటకొకసిద్ధాంతం. ఈ మార్పులను జీర్ణించుకోలేక మామూలు జనం గందరగోళంలో పడిపోతున్నారు. గత కొద్ది సంవత్సరాలలో ఆర్థిక రంగంలో జరిగిన మార్పుల - ఆర్థిక సరళీకృత విధానాలు, ద్రవ్యోల్బణం, ఫలితంగా ధరల పెరుగుదల - నుచూస్తుంటే పిచ్చెక్కిపోతోంది.

అలాగే సామాజిక సంబంధాలు · మనిషికి మనిషికి మధ్య సంబంధాన్ని, తల్లి బిడ్డల, భార్య భర్తల సంబంధాలను అనురాగంఆప్యాయతలతోగాక, డబ్బుతో, వ్యాపార దృక్పధంతో కొలుస్తున్నాము డబ్బు కొలతకు నిలవకపోతే ఆ అనుబంధం ఎంతోకాలం నిలవడం లేదు

ఇలా సంబంధాలు పెళుసు వారి, శరవేగంతో మార్పులు వస్తుంటే, ఆ మార్పులకు మనిషి ఎలా తట్టుకొంటాడు? మార్పు సహజమే. కాని మార్పు ఇంతవేగంగా వస్తుంటే? ఏది ఏమైనా అతడు వచ్చే మార్పును జీర్ణించుకొని మారాలి. అంటే త్వరత్వరగా మార్పును జీర్ణించుకొని మారాలి. జీర్ణించుకొని మారడం అంటే, గతంతో సంబంధాలను తెంచుకోకుండ, పూర్వాపరాలను విస్మరించకుండ, అర్థవంతమైన ప్రపంచంలో తన జీవితం మీద సంయమనాన్ని కోల్పోకుండ పరివర్తనం చెందడం. ఈ రకంగా జీర్ణించుకొని జీవించడం ఎంత మందికి సాధ్యమవుతోంది. అమెరికాలాంటి దేశాలలో అసలే సాధ్యం కాదు.

ప్రపంచం అంటే పరిసరం స్పుట్నిక్ వేగంతో పరుగిడుతోంది. మనం నత్తనడకతో దానినను సరిస్తుంటే,- ఇద్దరి మధ్య దూరం ఎక్కువవుతోంది. ఫలితం ఎలా ఉంటుందంటే పదకొండేళ్ళ పిల్లవాడికి ఆకస్మికంగా 90 ఏళ్ళ వృద్ధాప్యం వచ్చినట్లుంటుంది. 1967లో కెనడాలో నిజంగానే ఒక పిల్లవానికి ఇలాంటి జబ్బు వచ్చింది. పిందె ఆకస్మికంగా పండైతే ఎలా ఉంటుంది? పంచ్‌లో పడ్డ ఒక పద్యాన్ని ఇక్కడ ఉదహరించాలి

''కాంతి వేగాన్ని మించి ప్రయాణించ గల ప్రభాస
అనే అమ్మాయి, ఒకరోజు సాపేక్ష మార్గంలో
బయలుదేరి, అంతకు ముందరిరోజు రాత్రికే
తిరిగి వచ్చింది.''

ఈ చర్చను దృష్టిలో ఉంచుకొని మనం ఒక విషయాన్ని గమనించాలి. ఎప్పుడో రావలసిన మార్పు ఇప్పుడే వస్తే, ఎప్పుడో రావలసిన భవిష్యత్తు ఈరోజే వస్తే, అంటే కాలం ముందుకొస్తే, ముంచుకొస్తే, మనిషి కాలం దెబ్బకు తట్టుకొని నిలవగలడా? ఇలా ముందుకొచ్చిన భవిష్యత్తు కొట్టే దెబ్బల ప్రభావం మనిషి మీద ఎలా ఉంటుందో చెప్పబోయే ముందు, ఆధునిక సమాజ సంక్లిష్టతను గురించి కొద్దిగా చెప్పాలి

ఈనాటి మన సమాజం విరోధా భాసా ప్రపంచం సాంకేతిక శాస్త్రం మనిషి నభోమండలంలోకి విహారయాత్రకు పంపగలిగింది గాని, ఈ భూమిమీద సమస్యలను అది పరిష్కరించ లేకపోయింది. అతి వేగంగా పయనించే కార్లు మహానగరాలలో ''శిఖర ఘడియ''ల్లో నత్తలై పారాడుతాయి. కాల మండలాలను అనతికాలంలో దాటగల జెట్ విమానాలు మన నిద్ర ఉన్నిద్రల లయలకు భంగం కలిగిస్తున్నాయి ఉపగ్రహాల ద్వారా, సుదూరతీరాలకు ప్రసారం చేసి, మన సంగతులు వారికి చెప్పగలుగుతున్నాం గాని, మన యింటి ప్రక్కన ఉన్న వ్యక్తి భావాలకు ఉద్దేశాలకు అర్థంచేసుకోలేకపోతున్నాం చరిత్రలోనే అతి భాగ్యవంతమైన అమెరికాలో రెండున్నర కోట్ల మంది దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నారు న్యాయం, స్వేచ్ఛ, సమతలను ఆదర్శాలుగా పెట్టుకొన్న సమాజాలలో పక్షపాతం, విచక్షణలు, బలహీనులకు అన్యాయం విలయతాండవం చేస్తున్నాయి. పిల్లల పెంపకం, విద్యల గురించి పెద్ద పెద్ద మాటలు చెబుతామే గాని ఆచరణలో అవి శూన్యం. నిజానికి సిగరెట్లమీద, ఆల్కహాల్‌మీద, కార్లమీద పెట్టే ఖర్చు కంటె పిల్లల మీద, వారి విద్య మీద చాల తక్కువ ఖర్చే పెడుతున్నాం రక్షణాయుధాల మీద ఎక్కువ ఖర్చు చేసే కొలది భద్రత చేకూర వలసింది పోయి, క్షణ క్షణం భయం పెరిగిపోతున్నది అమెరికా అంటె అందరికీ భయం అందరికీ సమానావకాశాలు, ఎక్కువ అవకాశాలు, సంక్షేమం ప్రాతిపదికగానడుస్తున్న దేశాలలో అధికశాతం యువతలో వైమనస్యం పరాయితనం, ఏకాకితనం, విమానవీయత (Dehumanisation) ఎక్కువవుతున్నాయి.

ఇంతవరకూ చెప్పిన విరోధాభాసలు ఆధునిక సమాజాలకు అవశ్యలక్షణాలవుతున్నాయి ఇక ఇటువంటి సంక్లిష్ట సమాజాలకు ''వేగంగా జరిగే పరివర్తన'' తోడైనప్పుడు చెప్పవలసినదేముంది? మనిషి సతమతమైపోతాడు. మానసికంగా స్వాస్థ్యాన్ని కోల్పోతాడు ముఖ్యంగా ఎంతోకాలం మీదట జరగవలసిన మార్పులు ఒకే తరంలో జరిగినప్పుడు, మన ప్రాథమిక విలువలు, అభ్యుపగమాలు కూకటివేళ్ళతో కదిలిపోయే మార్పులు సంభవించేటప్పుడు, గమ్యరహితంగా అటువంటి మార్పులను అనుభవించ వలసి వచ్చినప్పుడు, - ఈ పరిస్థితి కారణంగా నిష్పన్నమయ్యే నూతన సమస్యల పరిష్కారానికి తగిన శిక్షణ లేనప్పుడు, శరపరం

పరగ జరిగే మార్పులు మతాలను ఏ దిశలో నడుపుతున్నాయో తెలియనప్పుడు, అంతకు ముందు సమాజంలో ఉన్న విలువలతో ఇమడని మార్పులు ఎక్కువగా జరిగేటప్పుడు, పరివర్తనం వ్యాకోచించగా భారం అధికమవుతున్నప్పుడు, మనిషి పని ఒడ్డున పడ్డ చేపలా ఉంటుంది. చేప గిలగిల కొట్టుకొన్నట్లే మనిషీ అదేవిధంగా ప్రతిస్పందిస్తాడు. అయితే ఆప్రతిస్పందనలకు ఒక దిక్కుదివాణం ఉండదు.

సమాజంలోని అశాంతిని చూస్తే మన ప్రతి స్పందనలు ఎలా ఉన్నాయో తెలుస్తుంది. ముఖ్యంగా రాజకీయ, కార్మిక విద్యారంగాలలో ఇవి ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. ఎక్కడ చూసినా గందరగోళం ఎవరు ఏపార్టీనుంచి మారి ఏపార్టీకీ మారుతున్నారో, ఎందుకు మారుతున్నరో, మారి ఎక్కడి పోతున్నారో వారికేతెలియదు. విద్యార్థులను సమ్మె, బంద్‌లు ఎందుకు చేస్తున్నారని అడిగితే అది వారికే తెలియదు. ఏమి చదువుకొంటున్నారో, ఎందుకు చదువు కొంటున్నారో వాళ్ళకే తెలియదు, వారి తలిదండ్రుల కంతకంటె తెలియదు.చదివే చదువు ఎక్కడకు తీసుకు వెళ్తుందో వారికి తెలియదు. నిన్నటి చదువు ఈ రోజు పనికి రావడంలేదు. ఈరోజు చదువురేపు పనికిరావడం లేదు. నిరంతరం మారే విద్య కావాలి. విజ్ఞానం అంగలు పంగలు వేసి వికసిస్తోంది. ఇలా పెరిగే విజ్ఞానాన్ని జెట్ వేగంతో మారే సమాజంలోని విద్యార్థికి అందించడం ఎలా? అదే సమయంలో అతడు కొన్ని ప్రాథమిక విలువలకు అంధుడు కాకుండా ఉండాలంటే ఏమిచెయ్యాలి? అందుకనే గ్లాస్ అనే విద్యావేత్త ప్రతి నాలుగేళ్ళ కొకసారి విద్య అనేది గతవ్యవహారమవుతుందని, అందుకని ''నిరంతరం మారే విద్యను'' ప్రవేశపెట్టాలని వాదిస్తున్నాడు.

అసలు ఈ అలజడులకు, అశాంతికి మరొక కారణం ఈ వేగం మూలంగా ఒక తరం సంస్కృతికి తరువాతి సంస్కృతికి మధ్యరేగిన ఘర్షణ. గాంధీతరం మనకు కొన్ని ఆదర్శాలను, దర్శానాలను, మధుర స్వప్నాలను మన ముందుంచి పోయింది. తరువాతి తరం సంస్కృతికి ఆకలలు కల్లలే అయ్యాయి. ఇలా భ్రమనుంచి బయట పడ్డ యువతారానికి ప్రపంచం చేదుగా అనిపించడంసహజం చేదుగా కనిపించే ప్రపంచంలో చేదు ప్రవర్తననుగాక మనం ఏమి ఆశించగలం?

పారిశ్రామిక విప్లవంతో మన దృక్పథం ఎంతోమారింది. 'శక్తి' అనేపదానికి కొత్త అర్థం ఏర్పడింది. విలువలు మారిపోయాయి. కుటుంబ సంబంధాలు విచ్ఛిత్తివైపునడిచాయి. వ్యవస్థలు పరివర్తితమయ్యాయి. కాల దూరాలు అర్థం మార్చుకొన్నాయి. ఈవిధంగా మనలను పెకిలించి వేసిన పారిశ్రామిక విప్లవం కొత్తవిలువలను, అర్థాన్ని అందించలేక పోయింది. అందుకే నేటి మన ఈతికమక.

సాంకేతిక, సామాజిక రంగాలలో వెల్లువలా వచ్చిపడుతున్న ఈ పరివర్తన వేగాన్నించి, దాని ఫలితాల నుంచి బయటపడమెలా? ఈ మార్పులకు మనిషి ఎలా ప్రతిస్పందిచాలి?

అందుకే, సమాజంలో అసలు ఏమార్పు లేకుంటేఎంత బాగుంటుంది అంటారు కొందరు. మార్పును వీరు నిరోధిస్తారుగూడ. దీనికి ప్రతిచర్యగా వీరు ''సనాతనత, ''కు ''సంప్రదాయాని''కి

అంటుకుపోతారు - అటువంటివాళ్ళు మార్పు వలన వచ్చే అనిశ్చిత, భయాలకు అంధులైపోతారు. సమాజంలోని మరోవర్గం జీవిత విధానాలలో, వ్యాకులతది, గందరగోళం, వైమనస్యాలతో, మార్పు ఉండాలని కాసేపు, మార్పు ఉండరాదని మరి కొంత సేపు వాదిస్తుంటారు. వీళ్ళు పాత కొత్త కలయిక కావాలంటారు. కొంతమంది సమూలమైన మార్పు రావాలంటారు. మరి కొంతమంది మార్పులకు తట్టుకోలేక పిచ్చివారవుతారు. లేదా సమాజ ప్రవాహం మధ్య నుంచి జారిపోయి ఉపాంతాలకు చేరతారు.

పరివర్తనం వల్ల సంభవించే అన్ని ఫలితాలను మనం ఊహించలేం. కుటుంబ సంబంధాలు, బడి, మతం, ఆచారం, ప్రభుత్వం, సైన్యం - ఇవన్నీ వివిధంగా మార్పులకు లోను కావలసిందే. వీటికి సంబంధించి ఏది మంచో ఏది చెడో విమర్శించుకొనే వ్యవధి లేదు కనుక, విచక్షణ లేకుండానే నిర్ణయాలు తీసుకోవాలి. మనకున్న జ్ఞానం అంతా గతానికి సంబంధించింది. మన తీసుకొనే నిర్ణయాలు భావికి సంబంధించినవి. గతానికి సంబంధించిన జ్ఞానం వర్తమానానికే సరిపోనప్పుడు, భావికెలా దారిచూపుతుంది. ఒక సంకటస్థితి మీద మీరొక సంకటస్థితి. తుపాకి గుండు మీదికి దూసుకువస్తోంది. సర్దుకోవడానికి చాలిన వ్యవధి, సమాచారం లేవు. అత్యయిక పరిస్థితిని అజ్ఞానంతో ఎదుర్కోవలసి వస్తోంది.

మానవుడు ఈ భూమి మీద అవతరించిన నాటినుంచి ఇటు వంటి పరిస్థితిని ఏనాడు ఎదుర్కోలేదు. అందుకని చరిత్ర ఈ విషయంపై మనకు ఏమీ పాఠాలు చెప్పదు. కాబట్టి సమస్యకు పరిష్కారం గడియారాన్ని వెనక్కు తిప్పడంలో లేదు. పరివర్తనను ఆపడంలో లేదు. దానికి సమాయత్తం కావడంలో ఉంది. అంటే రాబోయే మార్పులను ఊహించి, వాటికి తగినట్లు శక్తి సామార్థ్యాలను ఆర్జించడం బాధ్యతాయుతమైన పౌరులుగ, సామాజిక, సాంకేతిక పరివర్తనలను, జీవనస్థాయిని, విలువలను పెంచేట్లు, ప్రజాస్వామిక వ్యవస్థను పటిష్ఠపేయడం.

యువత శక్తి, తెలివితేటలు, ఆదర్శాలు - అవి ఏ దేశానికైనా పెట్టుబడులే. వీటిని సక్రమంగా వినియోగించాలంటే, వారిని జాతి జీవన భాగస్వాములను చేయాలి.

సమాజంలో వ్యక్తులు ఎవరి పని వారు చేసుకొంటూ పోతే సరిపోదు. ఎవరి ''పాత్ర''ను వారు నిర్వహించాలి. చిన్న పెద్ద గూడ చరిత్రలో, ఈ క్షణంలో ఒకే తరంలో భాగాలని గుర్తుంచుకోవాలి. మానవ ప్రాణాన్ని రక్షించడం, జీవితం నాణ్యతను పెంచడం ప్రతి ఒక్కరి కర్తవ్యం అని గుర్తుంచుకోవాలి. ఆర్థిక ప్రణాళికలలాగానే, ''సమాజ పరివర్తన ప్రణాళిక''లు వేయాలి.

మానవావసరాల కనుగుణంగా ''రేపు గుర్రాన్ని'' ఎక్కి కళ్ళేలు పుచ్చుకోవాలి. గుర్రం మనను స్వారి చేయరాదు. మనం గుర్రాన్ని స్వారి చేయాలి.

* * *

పంచామృతాలు

# కత్తి కోతల కబుర్లు

– పురాణం సుబ్రహ్మణ్యశర్మ

(అప్పలమ్మకి ఆపరేషన్ జరిగింది పొట్టలో కొండమ్మకి పురుట్లో ఆపరేషన్ చేసి బిడ్డను తీసేశారు ఎప్పుడో చాలా కాలం క్రితం. ఇద్దరూ తమకు జరిగిన శస్త్ర చికిత్సల గురించి ముచ్చటించుకుంటున్నారు. వారి వారి యాసల్లో.)

అమ్మోలమ్మ డాకటేరు బల్లమీద పండబెట్టి వొళ్లంతా తడుముతుంటే కితకితలే కితకితలు. పెనివిటి మీద చెయ్యేస్తేనే గుబులు గుబులు గుంటాది. బల్లమీద పండబెడితే నులకమంచంలో తొంగున్నట్టు ఓలప్పు - కితకితలే కితకితలు. ఓలమ్మో, ముక్కుకో డాట్టరు మూతికో డాట్టరు బల్ల సుట్టూ డాట్టర్లజాతరే జాతర. అప్పన్న కొండకీ యెప్పుడెల్లిన గాని సెప్పుకుంటే సెడ్డ సిగ్గోలప్ప - లా గయినాది బల్లమీదెక్కిన నాబతుకు - ముక్కుడాట్టరూ మూతి డాట్టరూ ఏవో గుసగుసలాడుకున్నారో లప్ప – జబ్బట్టుకోని సూదిమందు గుచ్చీసినాడే కొండా!

వొల్ల కోయ్ సెల్లి, పోకిరీ డాకటేర్లు సంక కింద సెయ్యెడతారు తడివేత్తారొల్లంతా - సచ్చినోల్లంతా వూసులాడుకుంటూ నవ్వుతా కత్తుల్దీస్తారు. పొట్టకోసినారే సెల్లి - రగత కాల్లీలు - సెయ్యెట్టి పొట్టంతా కెలికేసినారే!

మంతరసాను లుండరేటే పురుడొయ్యడానికి సెల్లి మొగోల్లెందుకే సెడ్డసిగ్గు.

కోకలు మురిగ్గుంటాయని తీసి గవున్లు తొడిగీసినారే -

మన కొంపల్ల మంతరసానులు పురుళ్లెలాగున పోస్తారే - ఈ డాకటర్లు మత్తుమందిచ్చి పడగొట్టి పొట్టకోసి బిడ్డన్దీసినారే అన్నేయం. మా మావ పైడితల్లి బిడ్డ న్నూసుకుందుకు మెడకాయ లోనెట్టినాడో లేదో, డాకటర్లు పూలు పూలంటూ తిట్టి పొమ్మని మెడబట్టుకు గెంటీసినారే ముదనష్టపోల్లు

పొట్టకోసి పేవులు సద్దారే - పొట్టలో కుంపటెట్టినట్టు వోలమ్మ - మంటలొగటే మంటలు - లోన దీపం ఎట్టి సూసినారే - చివుడి మూడోకన్నులాగుందోలె కొండా - బల్ల మీద మనకు సచ్చేసావు - ఆల్లు సేత్తో కోత్తా వున్నారు వూసులాడుకుంతా నవ్వుకుంతా కుసీ గుండారు. ఎద్దుపుండు కాక్కేం నెప్పి? యములోల్లి నాగ ఏసకాలేసు గొచ్చినట్టుందే ఓలమ్మ - మంచం సుట్టూ యములోళ్లు నిలబడ్డట్టు నిలునుండి పోయినారే సెల్లీ సెంద్రి. ఓలమ్మ యింతకంతి దీసి మావోడ్ని బిలిసి మీ ఆడదాయి కంతి పట్టుకెల్లిపోయి టిక్కట్టెట్టి సూపించు. అదేటమ్మ అది నెత్రు ముద్దే, కల్లు తిరిగిపోనాయి. బల్లమీదే ఒరిగా ఈ డాట్టర్లు ఆపరేసను సేత్తో అన్నాలెలా తింటారే - ఆల్లు ఆల్ల ఆడోల్ల మీన సెయ్యెలాగేస్తారే? ఆపరేసను గది ఎంతుందనుకున్నదంటే అక్కడిస్తరేసుకు కూడు దినొచ్చు - పాలొలకబోసి యెత్తచ్చు. అయితే యిన్ని కులాలు యిన్నోటి జాతులున్నా లోన కోస్తే అంతా వొకటేనే తల్లి. ఓల్లని కోత్తే నీల్లు మరోల్లని కోత్తే పాలూ కార్తాయేడే - సీమూ నెత్తురూ ఆల్లఅందరి కోడేనే - మనుసులెందుకు కొట్టుక సస్తా వుండారంతే యీ రగస్యం బోదపడక - అన్ని సదువుతాడా, ఆ బాపనోడి బొజ్జలో పుత్త కాలుంతయ్యాను కుంతావా - (నవ్వి) లోనంతా డొల్ల! కత్తిసూసి ఆ బాపనయ్య ఆరతిపల్లెం కాదు - కత్తికోత కోతానంటూ బావురు మన్నాడు. సదూకున్నోళ్లు గ్యానం వున్నోళ్లు కూడా ఆపరేసనికి ఏడిత్తే ఎల్లాగెల్లాగ? సావుని ఏ డాట్రు బాబూ రాకుండా మోకాలొడ్డనేడు. తొమ్మిది దర్వాజులు ఖిడ్కీలు యిది మాయాకాయము నరుడా - యిది మాయా కాయము నరుడా! -

*(ఈవిడ గారి స్వగతం యిది అనంతం.)*



స్వారి పాఠశాల

మార్క్ చిత్రలేఖనాల్లో ఏ జంతువు కంటె గూడ గుర్రం ఎక్కువగా కనిపిస్తుంది. ఇది సహజాత జీవనానికి ప్రతీక.

